# ర్ ర్ ర్...మ్...
# ఒక అత్యద్భుతమైన విందు...
# న్యూట్రిన్ సూపర్ రేంజిలో

కాఫీ టాఫీ

కోకోనట్ బాన్ బాన్స్

డచ్ టాఫీ

మిల్క్ కారమెల్స్

లాక్టో బాన్ బాన్స్

ఎంత ఎంత మిఠాయి... మంచి మంచి మిఠాయి రుచికరమైనది....త్వరపడండి.... నోట నీరూరించే సాటిలేని మేటి న్యూట్రిన్ "సూపర్" మిఠాయిలను, టాఫీలను కొనండి.




ఒక్కొక్క మిఠాయియందు
ఫలరసపూరితవిందు!

న్యూట్రిన్ కన్‌ఫెక్షనరీ కంపెనీ లిమిటెడ్, పలమనేర్ రోడ్డు, చిత్తూరు, ఆం.ప్ర.

# పిల్లలలో చాలమంది అవసరమైనన్ని పాలు తాగరు



# అందుకే వారికి కావాలి కాల్షియం-శాండోజ్® బిళ్ళలు

**భారతదేశంలో చాలమంది పిల్లలలో కాల్షియం కొరత ఉంది**

మరి, మీ పిల్లలలో కూడానా ? మీ పిల్లలకు కావలసిన కాల్షియం పోషణ వారి పళ్ళకూ, ఎముకలకూ లభిస్తోందా అన్నది మీరే చూసి చెప్పగలరు. వారిలో అందరూ రోజుకు చెరో 3 పెద్ద గ్లాసుల పాలు తాగుతున్నారా? లేదు! అయితే వారికి కాల్షియం-శాండోజ్ బిళ్ళలు తప్పని సరిగా కావలసిందే.

కాల్షియం-శాండోజ్ గట్టిపళ్ళు, దృఢమైన ఎముకలు పెంపొందేందుకు తోడ్పడుతుంది. విటమిన్ సి, డి, బి12 తో బలపరచపడి, రాస్ప్‌బెర్రీ రుచిగల కాల్షియం-శాండోజ్ బిళ్ళలు బలే రుచికరమైనవి. పిల్లలు అవంటే ముచ్చట పడతారు.

కాల్షియం-శాండోజ్ — ప్రపంచంలో మేలైన కాల్షియం స్విట్జర్లెండ్ లోని శాండోజ్ వారు రూపొందించినది.



మీ పిల్లలకు రోజూ కనీసం 4 కాల్షియం-శాండోజ్ బిళ్ళలు కావాలి 2 బిళ్ళలు ప్రతిసారి భోంచేసే ముందు



# కాల్షియం-శాండోజ్®

## గట్టి పళ్ళు, పటిష్టమైన ఎముకలకోసం





daCunha/CS/19 P TEL

## చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

---

ఏప్రిల్ నెల బేతాళకథ [''దేశాటన''] గంగిశెట్టి శివకుమార్ రచన. ఈ నెల బేతాళకథ [''కలిసి రాని కాలం''] తంజావూరు రాజేంద్రప్రసాదు రచన. సామాజిక కళలకు ఎన్నో ప్రయోజనా లుంటాయి. వాటివల్ల కళాకారుడికి పేరుప్రఖ్యాతులూ, రాజాదరణా లభిస్తాయి. ఒక్కొక్కప్పుడు గొప్ప కళాకారులు దేశానికే అంతర్జాతీయఖ్యాతి తెస్తారు. ఇందుకు ఉదాహరణగా రవీంద్రనాథ టాగోరునూ, (ఈనాటి సత్యజిత్ రాయ్‌నీ) చెప్పుకో వచ్చు. కేవలమూ తన కోసమే కళారాధన చేసేవాడు నిజమైన కళాకారుడుకాడు.

---

సంపుటి 60 మే '77 సంచిక 5

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00






ప్రశమశ్చ, క్షమా చైవ,
ఆర్జవం, ప్రియవాదితా,
అసామర్థ్యం ఫలం త్యేతే
నిర్గుణేషు సతాం గుణాః. 1

[సత్పురుషులలో ఉండే శాంతమూ, సహనమూ, నిష్కపటమూ, ప్రియభాషణమూ దుష్టులకు అసామర్థ్య లక్షణాలుగా కనిపిస్తాయి.]

ఆత్మప్రశంసినం, దుష్టం,
ధృష్టం, విపరిధావకం,
సర్వత్రోత్సృష్టదండం చ,
లోక స్సత్కురుతే నరమ్. 2

[ఆత్మస్తుతి చేసుకుంటూ, దుష్టుడూ, క్రూరుడూ, అందరినీ దండించేవాడూ అయినవాణ్ణి లోకం గౌరవిస్తుంది.]

న సామ్నా శక్యతే కీర్తిః,
న సామ్నా శక్యతే యశః,
ప్రాప్తుం, లక్ష్మణ! లోకేస్మిన్
జయో వా రణమూర్ధని. 3

[లక్ష్మణా, ఈ లోకంలో కీర్తిగాని, యశస్సుగాని, యుద్ధంలో జయంగాని మంచితనంతో రావు.]

చెడువల్ల లాభాలు




## 47

కాకిరాజు మేఘవర్ణం అయిదుగురు మంత్రుల అభిప్రాయాలను గురించి తన అభిప్రాయం అడిగిన మీదట వృద్ధజ్ఞాని అయిన స్థిరజీవి ఇలా అన్నది :

"నాయనా, ఇప్పుడు మనం విన్న అయిదు అభిప్రాయాలూ సుప్రసిద్ధ రాజనీతి గ్రంథాల నుంచి ఏకరువు పెట్టినవి. పరిస్థితులు మరోవిధంగా ఉంటే అవి మంచిసలహాలు కూడా కావచ్చు. కాని ఇప్పుడున్న పరిస్థితిలో శత్రువులు బలవంతులు కావటంచేత నయనీతి గాని, నయవంచన గాని అవసరం. మిగిలిన అయిదు ఉపాయాలద్వారా లభించని విజయం వీటిద్వారా కలుగుతుంది. శత్రుస్థావరం మీద నిఘా ఉంచి, ఒక వ్యక్తిని బలికావటానికి ఒప్పించినట్టయితే, శత్రువును నాశనం చెయ్యగలం"

"నాయనగారూ, కాకులకూ, గుడ్లగూబలకూ మధ్య ఈ గర్భశత్రుత్వం ఏర్పడటానికి కారణం ఏమిటి?" అని మేఘవర్ణం అడిగింది.

స్థిరజీవి ఆ కథ ఇలా చెప్పింది:

ఒకప్పుడు హంసలూ, కొంగలూ, కోయిలలూ, నెమళ్ళూ, పావురాలూ, గద్దలూ మొదలైన అడవిపక్షులు సమావేశమై ఇలా అనుకున్నాయి :

"గరుత్మంతుడు మనకు రాజు. అయినా అతని కాలమంతా నారాయణుడి సేవలోనే గడుస్తున్నది. అలాటి రాజువల్ల ఏం లాభం? మనని ఉచ్చులు వేసి పట్టుకున్నా, చంపుతున్నా కాపాడడు. ప్రజల భీతిని పారదోలి కాపాడని రాజు మృత్యువుతో సమానుడు. అందుచేత మనం మరొక పక్షులరాజును ఎన్నుకుందాం."



అన్నిపక్షులలోకీ హుందాగా కనిపించిన గుడ్లగూబను పక్షులు తమ రాజుగా ఎన్నుకుందామనుకున్నాయి. గుడ్లగూబ పట్టాభిషేకానికి కావలిసిన సరంజామా అంతా సేకరించబడింది. పవిత్రనదుల జలాలన్నీ వచ్చాయి. సింహాసనం సిద్ధం చేసి దానిమీద పులిచర్మం కప్పారు. బ్రాహ్మణులకు ఇవ్వవలిసిన దక్షిణ పోగు చేశారు. పక్షులు స్తోత్రపాఠాలు పాడాయి. బ్రాహ్మణులు వేదపఠనం చేశారు. హారతి కర్పూరం వెలిగించి, చుట్టూ తిప్పారు. మంగళవాద్యాలు మోగాయి.

గుడ్లగూబా, దాని పెద్దభార్యా సింహాసనం మీద కూర్చున్నాయి. అభిషేకం జరగబోతూండగా కర్కశమైన కాకి అరుపు వినిపించింది. కాకి అప్పుడే వచ్చింది.

"ఈ పక్షులన్నీ ఇక్కడ చేరాయేమిటి? ఏమిటి పండగ?" అనుకున్నది కాకి.

కాకిని చూసి మిగిలిన పక్షులు, "పక్షులలో కాకి తెలివిగలది. మనుషులలో మంగలీ, నాలుగుకాళ్ళ జంతువులలో గుంటనక్కా, సన్యాసులలో శ్వేతాంబరులూ తెలివిగలవాళ్ళు. అందుచేత రాజును ఎన్నుకోవటం గురించి మనం కాకి అభిప్రాయం తెలుసుకోవాలి," అనుకున్నాయి.

ఈ లోపల కాకి పక్షులను చేరి, "ఈ సమావేశం ఏమిటి? ఏదో ఉత్సవం జరుగుతున్నట్టున్నది," అని అడిగింది.

అవి ఇలా అన్నాయి:

"చూడు, ఇప్పుడు పక్షులకు రాజు లేడు. అందుచేత పక్షులన్నీ చేరి గుడ్లగూబను రాజుగా ఎన్నుకుని, ఈ రోజు పట్టాభిషేకం అనుకున్నాయి. నీ ఉద్దేశం ఏమిటి? సమయానికి వచ్చావు!"

కాకి నవ్వి, "హంసా, నెమలీ, కోయిలా, చిలుకా లాటి గొప్ప గొప్ప పక్షులు, ఎంతో జ్ఞానం కలవి ఉండగా, ఈ భయంకరమైన పక్షిని, అందులోనూ పగలు చూపు అనని దాన్ని, ఎలా ఎన్నుకున్నారు? ఈ నిర్ణయం సరికాదు. నేను ఒప్పను," అని, ఇంకా ఇలా అన్నది:

'' ఈ గుడ్లగూబకు ముక్కు వంకర. కళ్ళు మెల్ల. చూడటానికి ఉత్తప్పుడే భయంకరంగానూ, అసహ్యంగానూ ఉంటుంది. ఇక కోపం వస్తే ఎలా ఉంటుందో ఆలోచించండి. ఈ గుడ్లగూబను రాజుగా పెట్టుకుని మనం ఏం బాగుపడతాం? ఒకవేళ ఈ గుడ్లగూబలో అన్ని మంచి లక్షణాలూ ఉన్నాయే అనుకున్నా, మనకు గరుత్మంతుడు రాజుగా ఉండగా ఇంకో రాజుతో ఏం పని? ఒక రాజు ఉండగా ఇంకో రాజును ఎన్నడూ ఎన్నుకోరాదు. ఒక రాజు కిందనే రాజ్యం బాగుపడుతుంది. అనేకమంది రాజులు నాశనానికి దారి తీస్తారు. గరుత్మంతుడి పేరు వింటేనే మీ శత్రువులు పారిపోతారు. గొప్పవాడి పేరు చెబితేనే దుర్మార్గులు వణికి పోతారు. గొప్పవాళ్ళ పేరు ఉచ్చరిస్తేనే విజయం లభిస్తుంది. వెనకటికి కుందేళ్లు చందమామను తమ రాజుగా ప్రకటించి సుఖపడ్డాయి కావా?''

'' ఏమిటా కథ? '' అని పక్షులు కాకిని అడిగాయి. కాకి వాటికి " చంద్రసరస్సు" కథ ఇలా చెప్పింది:

ఒకానొక అరణ్యంలో చతుర్దంతం అనే గొప్ప ఏనుగుల రాజు ఉండేది. దాన్ని ఆశ్రయించుకుని అనేక ఏనుగులు ఉండేవి. చతుర్దంతం తన అనుచరులను చక్కగా కాపాడేది.

ఇలా ఉండగా పన్నెండేళ్ళ క్షామం వచ్చింది గుంటలూ, చెరువులూ, సరస్సులూ అన్నీ ఎండిపోయాయి. అప్పుడు ఏనుగులు తమ రాజుతో, '' స్వామీ, దాహనికి తట్టుకోలేక పిల్ల ఏనుగులు చచ్చిపోతున్నాయి. దయచేసి మా దాహం తీరేలాగా ఎక్కడైనా జలాశయం ఉంటే చూడు,'' అన్నాయి.

చతుర్దంతం వేగంగా పరిగెత్తగల ఏనుగులను అష్టదిక్కులకూ పంపి, నీరు ఎక్కడ ఉన్నదీ చూసి రమ్మన్నది. తూర్పుగా వెళ్ళిన ఏనుగులకు చంద్ర సరస్సు కనబడింది.



# 185. లింగపార్వతాలయం

**లా**వోస్‌లో వాల్‌పు వద్ద ఈ లింగపార్వతాలయం ఉండేది. దాన్ని బ్రాహ్మణులు వదిలేసినాక బౌద్ధులు వాడుకున్నారు. మీకాంగ్ నదీ సమీపంలో ఉండే ఒక కొండ వద్ద బ్రాహ్మణులకు పవిత్రంగా ఉండిన ఒక జల కూడా బౌద్ధుల శౌచస్నానాలకు ఉపయోగపడింది.





# మాయాసరోవరం

## 17

[కృపాణజిత్తు మాయమాటలతో, గడెకొండ మరుగుజ్జులను నమ్మించాలని చూశాడు. కాని, బలవంతుడైన అతణ్ణి చంపేందుకు గడెకొండ, అతడు నిద్రపోతున్న గుడిశెకు నిప్పు పెట్టించాడు. కృపాణజిత్తు గుడిశె నుంచి బయటపడి, మరుగుజ్జులను ఒక చెట్టుకొమ్మతో కొట్టసాగాడు. ఇదంతా అరణ్యంలోని యిద్దరు వింతమనుషులు గమనించారు. తరవాత—]

అరణ్యంలోని వింత మనుషులిద్దరూ మరుగుజ్జులగూడెం కేసి ఆశ్చర్యంతో ఒకటి రెండు క్షణాలు చూశారు. తరవాత వాళ్ళల్లో ఒకడు చప్పున కత్తిదూసి, "అన్నా, సర్పనఖా! ఆ కనబడే గూడాన్ని ఎవరో శత్రువులు ముట్టడించి, సర్వనాశనం చేస్తున్నట్టున్నది!" అన్నాడు.

ఆ మాటలకు సర్పనఖు డనే వాడు, ఏ మాత్రం తొణుక్కుండా, "సర్వనాశనం చెయ్యనీ, సర్పస్వరా! మనం ఏ లోకం వాళ్ళం? ఇదే లోకం? ఎవరెట్లా పోతే మనకేం? మనం వచ్చిన పనేమిటి? మన జలాశ్వాల జాలపాదాలు అరిగి పోయేలా, యీ అరణ్యాలూ, కొండలూ పట్టుకుని ఎందుకు తిరుగుతున్నాం?" అన్నాడు.

"అన్నా, ఆ మాట నిజమే. కాని, నా కొక అనుమానం కలుగుతున్నది." అంటూ సర్పస్వరు డనేవాడు గుర్రం



మీద నిలబడి, ఎగిరి అందుబాటులో వున్న చెట్టుకొమ్మను పట్టుకుని వేళ్లాడుతూ గూడెం కేసి చూసి, "అన్నా, ఇదేదో బహు చిత్రంగా వున్నది. భయంకరమైన నరవానరం ఒకటీ, ఒక మామూలు మనిషీ కలిసి, మరుగుజ్జు వాళ్ళను చిత్రవధ చేసేస్తున్నారు. చూస్తూ ఊరుకోవటం ఎలా?" అన్నాడు.

"అలాగా! అయితే ఆ నరవానరాన్నీ, మనిషినీ ప్రాణాలతో పట్టుకోవటం అవసరం. వాడి ద్వారా తప్పిపోయిన మనవాడి సమాచారం ఏమన్నా తెలుస్తుందేమో!" అంటూ సర్పనఖుడు తన గుర్రాన్ని అదిలించి, జీను నుంచి చుట్టలా వేళ్ళాడుతున్న తామరకాడల మోకును చేతికి తీసుకున్నాడు.

ఇద్దరూ తమ గుర్రాల మీద వేగంగా గడెకొండ గూడాన్ని చేరేసరికి, నరవానరం గెంతుతూ, తన బలమైన చేతులతో పట్టి గుడిశెలను కూలదోస్తున్నది. కృపాణజిత్తు పిచ్చిఎత్తిన వాడిలా అరుస్తూ, తన పైకి వస్తున్న మరుగుజ్జులను చెట్టుకొమ్మతో కొడుతున్నాడు.

"అన్నా, నేనీ నరవానరం సంగతి చూస్తాను; నువ్వు ఆ ఎనుబోతులాంటి మనిషిని పట్టి బంధించు," అంటూ సర్పస్వరుడు తన గుర్రాన్ని నరవానరం కేసి పరిగెత్తించాడు.

సర్పనఖుడు తామరకాడల మోకును పైకెత్తి, దాని ఉచ్చును కృపాణజిత్తు కంఠాని కేసి విసురుతూ, "మాయా సరోవరేశ్వరుడుకీ, జై!" అంటూ అరిచాడు.

వింతగుర్రాల మీద, హఠాత్తుగా తమ మీదికి వచ్చి పడిన సర్పనఖ, సర్పస్వరులను చూస్తూనే, మరుగుజ్జులూ, కృపాణజిత్తూ నిశ్చేష్టితులైపోయారు. సర్పనఖుడు విసిరిన తామరకాడల తాడు కృపాణజిత్తు కంఠానికి చుట్టుకున్నది. దాని ఉచ్చు కంఠాన్ని బిగించి పట్టేలోపలే కృపాణజిత్తు ఒక చావు కేకపెట్టి, "అయ్యా,

నన్ను చంపకు! నీలాంటి మనిషే—ఒక వింత ఏనుగునెక్కిన మహాబలుడికి, నేను లోగడ చాలా సహాయం చేసి వున్నాను,'' అన్నాడు.



ఆ మాటలకు సర్పనఖుడు ఆశ్చర్యపోతూ, ''అయితే, నీకు మకరకేతు తెలుసునన్నమాట! అంత గొప్ప యోధుడు నీ నుంచి సహాయం కోరాడంటే, అతడు చాలా పెద్ద యిక్కట్టులలో చిక్కి వుండాలి. ఆ మకరకేతు యిప్పుడెక్కడున్నాడు?'' అని అడిగాడు.

కృపాణజిత్తు చేతులు రెండూ ముందుకు చాచి, ''తమ ప్రశస్తమైన తామరకాడల తాటి ఉచ్చు, నా గొంతును బాగా బిగించి పట్టి వున్నది. మాట్లాడటం కష్టసాధ్యమవుతున్నది. కొంచెంగా వదులు చేసేందుకు అనుమతిస్తారా?'' అని అడిగాడు.

''అలాగే అనుమతించాను. పారిపోయేందుకు ప్రయత్నించావో, ఆ తాడు నీ పాలిటి యమపాశమవుతుంది,'' అన్నాడు సర్పనఖుడు.

కృపాణజిత్తు తామరకాడల తాడును రెండు చేతులతో పట్టుకుని, ఉచ్చును కాస్త పక్కకు లాగి, గట్టిగా ఓ సారి గాలి పీల్చుకుని, ''అయ్యా, ఆ మకరకేతు యిప్పుడెక్కడున్నాడో నాకు తెలియదు. మిమ్మల్ని చూసిం తరవాత యిప్పుడు సంగతి సందర్భాలన్నీ తేటతెల్లనవుతున్నై. ఇప్పటికి కొద్దిరోజుల క్రితం అమరావతీనగరం ప్రాడైన జయశీలుడనే వాడూ, వాడి మిత్రుడైన కాపాలికుడొకడూ, మకరకేతును అరణ్యంలో నానా హింసలపాలూ చేశారు. ఈ సంగతి నేను అరణ్యప్రాంతాల నివసించే వాళ్ళ ద్వారా విన్నాను,'' అన్నాడు.

ఆ జవాబుకు సర్పనఖుడు కళ్ళెర్ర చేసి, ''ఒరే, మాయలమారీ! నే నడిగిన దేమిటి? నువు చెపుతున్నదేమిటి? మకరకేతుకు ఏదో సాయం చేశానని




చెప్పావు. అతడిప్పుడెక్కడున్నాడని అడిగాను. నువు అర్థంలేని మాటలతో కాలయాపన చేస్తావెందుకు?'' అన్నాడు.

కృపాణజిత్తు ఆ క్షణానికి ప్రాణాపద నుంచి బయటపడేందుకు మకరకేతు తనకు తెలుసునన్నాడుగాని, నిజానికి అతడు మకరకేతును చూసింది కూడా లేదు. అయితే, అతడు అరణ్యాల్లో తిరుగుతున్నప్పుడు, అక్కడ నివసించే పల్లెవాసుల ద్వారా మకరకేతును గురించి కొంత విని వున్నాడు.

ఈసారి ఎలాంటి అబద్ధం యింకొకటి చెప్పి, ప్రాణ రక్షణ చేసుకుందామా అని కృపాణజిత్తు ఆలోచించేంతలో, మరుగుజ్జు వాళ్ళంతా ఒక్కసారిగా గొల్లుమన్నారు. సర్పనఖుడు కోపంగా తల తిప్పి వాళ్ళకేసి చూశాడు. గడెకొంఢ వంగి అతడికి నమస్కారం చేసి, ''అయ్యా, నీటి గుర్రం శూరుడా! మీరు యీ దుర్మార్గుడితో మాట్లాడుతూ, తమ తోటివాడికేమైనదీ గమనించనే లేదు,'' అన్నాడు.

గడెకొంఢ యిలా అనేసరికి సర్పనఖుడికి చప్పున తన తమ్ముడైన సర్పస్వరుడి మాట గుర్తుకొచ్చింది. వాడు తల తిప్పి అటూ యిటూ చూసి, ''ఒరే, తమ్ముడూ, సర్పస్వరా ఎక్కడ? ఆ నరవానరం ఏమైంది?'' అని కేకపెట్టాడు.

రెండు మూడు క్షణాలు చూసినా తన తమ్ముడి నుంచి జవాబు రాకపోయేసరికి సర్పనఖుడు పళ్ళు కొరుకుతూ మరుగుజ్జుల కేసి చూశాడు. వాళ్ళందరూ తలలు వంచుకుని నేల చూపులు చూస్తున్నారు.

''ఒరే మందమతి మరుగుజ్జు వెధవల్లారా! అలా మెడలు వేళ్ళాడవేసి చూస్తారేం? ఏం జరిగింది?'' అని మరుగుజ్జులను గద్దించి అడిగాడు సర్పనఖుడు.

గడెకొంఢ తల ఎత్తి, ''నీటి గుర్రం శూరుడా! నీ తమ్ముడూ, నరవానరం



కలిసి అలా ఆ కనబడే చెట్ల గుంపు కేసి పోయారు. నీటి గుఱ్ఱం మరొక వైపుకు దౌడు తీసింది. ఆ వానరం యీ కృపాణ జిత్తు అనే దుర్మార్గుడి పెంపుడు జంతువు. అది వీడు చెప్పకుండానే వీడి మనో భావాలను గ్రహించి—అజ్ఞలు నెరవేరు స్తుంది. నీ తమ్ముణ్ణి మెడ పట్టుకుని ఎత్తి, భుజాన వేసుకుని అరణ్యంలోకి పారిపొమ్మని, నరవానరాన్ని వీడే సంజ్ఞల ద్వారా ఆజ్ఞాపించి వుంటాడు.'' అన్నాడు.

''ఒరే, చావు కబురు ఎంత చల్లగా చెప్పావురా, మరుగుజ్జు వెధవా!'' అంటూ సర్పనఖుడు బాధగా కేకపెట్టి, కృపాణజిత్తు కంఠానికి వేసిన తామర కాడల తాడును గడెకొండ చేతికి యిస్తూ, ''ఈ దుర్మార్గుడు పారిపోకుండా చూసే బాధ్యత నీది. ఆ నరవానరాన్ని చంపి, నా తమ్ముణ్ణి యిప్పుడే విడిపించుకు వస్తాను.'' అంటూ జలాశ్వాన్ని అదిలించి, వేగంగా గడెకొండ చెప్పిన చెట్ల గుంపు కేసి పరిగెత్తించాడు.

మరుగుజ్జుల గూడెంలో ఇళ్ళు తగల బడుతూ లేచిన పొగా, కృపాణజిత్తూ, నరవానరాలతో గడెకొండ అనుచరులు తెగించి పోరాడుతున్నప్పుడు రేగిన కల్లోలం, రాళ్ళగుట్ట అవతల వున్న జయశీలుడూ, సిద్ధసాధకుడూ విన్నారు. దానికి కారణం ఏమిటో తెలుసుకోమని వాళ్ళు, మరుగుజ్జు సేనానికి చెప్పారు.

మరుగుజ్జు సేనాని ఇద్దరు అనుచరు లను వెంటబెట్టుకుని స్వయంగా గుట్ట మీదికి పోయి గడెకొండ గూడెం కేసి చూశాడు. ఇళ్ళు తగలబడుతున్నవి. కృపాణజిత్తూ, నరవానరం మరుగుజ్జు లను నానా హింసా పెడుతున్నారు.

ఈ జరుగుతున్న దానికి సేనా నాయకుడు చాలా సంతోషించి, యీ శుభ వార్త జయశీలుడికి చెప్పేందుకు వెను దిరగబోయేంతలో, హఠాత్తుగా జలాశ్వాల మీద యిద్దరు వింత మనుషులు వచ్చి, పోట్లాడుకుంటున్న వాళ్ళమీద పడ్డారు!



"ఆ వింత గుర్రాలేమిటి? ఆ వింత మనుషులెవరు?" అంటూ మరుగుజ్జు సేనాని ఆశ్చర్యపడుతున్నంతలో, జలాశ్వం మీద వున్న వాడొకడు పొడవాటి తాడును కృపాణజిత్తు మీదికి విసిరి, అతడి కంఠాన్ని ఉచ్చులో బిగించాడు. రెండవ జలాశ్వికుడు కత్తి పైకెత్తి నరవానరం మీదికి పోయాడు....

మరుగుజ్జు సేనాని పరమానందంతో పెద్దగా నవ్వి, తన అనుచరులను అక్కడే వుండమని, "ఒరే, గడెకొండ ముఠా వాళ్ళనందర్నీ నరికి పోగులు పెట్టటానికి యిది మనకు మంచి అవకాశం. ఈ సంగతి రాణీతో, ఆ మహాకాయులతో చెప్పి, మన భటుల్ని వెంట బెట్టుకు వస్తాను. మీరుమాత్రంయిక్కడేవుండండి." అని గూడెం కేసి పరిగెత్తాడు.

మరుగుజ్జు సేనాని తిరిగివచ్చి గడెకొండ గూడెంలో ఏం జరుగుతున్నదో చెప్పగానే సిద్ధసాధకుడు ఎగిరి గంతేసి శూలం పైకెత్తి, "జై, మహాకాళా!" అంటూ అరిచి, జయశీలుడితో, "జయా, యిక మనం వచ్చిన పని నెరవేరినట్టే! ఈ వింత గుర్రాల మీద వచ్చినవాళ్ళిద్దరూ, ఆ వింత ఏనుగు జలగ్రహాన్ని ఎక్కి వచ్చిన మకరకేతు గుంపులో వాళ్ళేననే దాంట్లో సందేహం లేదు. ఆ మకరకేతు మననుంచి పారిపోయాడు. ఇప్పుడు యీ ఇద్దర్నీ పట్టుకుని, నయానో భయానో వాళ్ళ ద్వారా, ఆ మాయాసరోవరేశ్వరుడుండే చోటు తెలుసుకోవచ్చు. ఆ తరవాత కనకాక్షరాజుగారి పిల్లలు–కాంచనవర్మా, కాంచనమాలలను బంధవిముక్తుల్ని చేయటం క్షణాలమీద పని!" అన్నాడు.

జయశీలుడు, సిద్ధసాధకుడి మాటలు విని, అతడి కేసి మౌనంగా చూస్తూ వూరుకున్నాడు. సాధకుడు కొంచెం విసుగ్గా, "జయశీలా, నేను చెప్పిందేమిటో నువు విన్నట్టే లేదే!" అన్నాడు.

జయశీలుడు చిన్నగా నవ్వి, "సాధకా, అన్ని క్షణాలపాటు పాఠంలా చదివిన



నీ మాటలు వినకపోవటం ఏమిటి? కాని, నా కొకటే ఆశ్చర్యం. ఎవరో ఇద్దరు మనుషులు వింతగుర్రాల మీద వచ్చారని వింటూనే, నువ్వు కనకాక్షరాజుగారి పిల్లలు మనకు దొరికినంత ఉత్సాహంగా మాట్లాడుతున్నావు!'' అన్నాడు.

ఆ జవాబు సిద్ధసాధకుణ్ణి చాలా నిరుత్సాహ పరిచింది. అతడు గట్టిగా శూలంతో నేలనొకసారి పొడిచి, ''జయా, యిలా అయితే యిక ఏనాటికి మనం ఆ రాజుగారి పిల్లలు ఎక్కడ వున్నారో కనుక్కునేట్టు? ఈ లోపల మనం యీ అరణ్యాల్లో తిరుగుతూనే ముసలి వాళ్ళమైపోతాం," అన్నాడు.

''ఆ ముసలితనం నగరాల్లో పెద్ద పెద్ద భవనాల్లో నివసించినా మనను పట్టుకు తీరుతుంది. నే నాలోచిస్తున్నదేమిటంటే, యీ ఇద్దరు వింత మనుషులూ, యీ ప్రాంతాలకు ఎందుకు వచ్చారన్నదొకటి; రెండోది వాళ్ళను ప్రాణాలతో పట్టుకోవటం ఎలా అన్నది.'' అన్నాడు జయశీలుడు.

ఈ జవాబు వింటూనే సిద్ధసాధకుడు నిరుత్సాహ పడిపోయి, శూలాన్ని కింద పడవేసి, ''జయా! ఆ వింతమనుషుల్ని ప్రాణాలతో పట్టుకునే పథకం ఏదో నువ్వే ఆలోచించు,'' అన్నాడు.

జయశీలుడు సరేనన్నట్టు తల ఊపి, ''అయితే నువ్వు శూలం కింద పడవేశావెందుకు? ఇకనుంచి నీ మంత్రశక్తినే నమ్ముకోదలిచావా?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు సిద్ధసాధకుడు, "జై మహాకాళా!" అంటూ చిన్నగా మూలిగి, చప్పున శూలాన్ని చేతికి తీసుకుని, ''జయశీలా! నా మంత్రశక్తి యింకా పరిపక్వం కాలేదు. ఆనాడు శ్మశానంలో మహాకాళుడి బంటు కాలకాలుడే నా ప్రాణాలు పుచ్చుకునేంత పనిచేశాడు గదా?'' అన్నాడు.

''అవునవును! ఆ కాలకాలుడికి బదులు, మనిద్దరి ప్రాణాలనూ, ఆ మాయా

సరోవరేశ్వరుడే. వాడి ఐంట్లో ఎత్తుకు పోయే ప్రమాదం వున్నది.'' అని జయ శీలుడు మరుగుజ్జు సేనాని కేసి తల తిప్పి, '''సేనానీ, నువ్వు కొందరు భటులతో మా వెంట రావలసి వుంటుంది." అన్నాడు.

''అయ్యా, అలాంటి ఆజ్ఞ కోసమే నేను ఎదురు చూస్తున్నాను!'' అని మరు గుజ్జు సేనాని, దూరంగా నిలబడి వున్న మరుగుజ్జు భటులకు సంజ్ఞ చేశాడు.

అందరూ కలిసి రాళ్ళగుట్ట కేసి కొంతదూరం నడిచేసరికి, వాళ్ళకు కుడి వైపున వున్న అరణ్యవృక్షాల్లో నుంచి నర వానరం భయంకరంగా అరవటం విని పించింది. జయశీలుడితోపాటు అందరూ ఆశ్చర్యపోతూ అటు కేసి చూశారు. నర వానరం చెట్ల కిందుగా గెంతుతూ నడు స్తున్నది. దాని భుజాల మీద వింత దుస్తుల్లో వున్న మనిషి ఒకడు కదలా మెదలక పడి వున్నాడు.

''జయా! మనం ప్రాణాలతో పట్టు కుని, మాయాసరోవర రహస్యాలు తెలుసు కోవాలనుకున్న వాళ్ళల్లో ఒకడు నర వానరం చేతుల్లో హతమైపోయినట్టున్నది! ఆ రెండో వాడి మాటేమిటి?'' అన్నాడు సిద్ధసాధకుడు.

జయశీలుడు ఒకటి రెండు క్షణాలు నిశ్చేష్టుడైపోయి, "ఆ రెండో వాడు కృపాణ జిత్తు చేతిలో చావలేదుగదా!'' అన్నాడు.

''అలా జరిగితే యిక కృపాణజిత్తును పట్ట పగ్గాలుండవు! ఒక వింత మనిషిని వాడి పెంపుడు నరవానరం ఎత్తుకు పోతున్నది. రెండవవాణ్ణి....''

సిద్ధసాధకుడు మాట ముగించే లోపలే జలాశ్వం మీద సర్పనఖుడు వేగంగా చెట్ల కిందికి వస్తూ, "సర్పస్వరా! ఎక్కడ? సర్పస్వరా!'' అంటూ కేకలు పెట్ట సాగాడు.

జయశీలుడు చప్పున చేయెత్తి, "అందరూ వాడి కంటబడకుండా దాక్కోండి. ఎలా అయినా సరే, వాణ్ణి ప్రాణాలతో పట్టుకోవాలి!'' అని హెచ్చ రించాడు. —(ఇంకా వుంది)







# కలిసిరాని కాలం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ఏ ఉన్నత ఆదర్శంతో ఇలా శ్రమ పడుతున్నావో తెలీదుగాని, ఉన్నత ఆదర్శాలు ఒక్కొక్కసారి తీరనినష్టం కలిగిస్తాయి. ఇందుకు నిదర్శనంగా నీకు సుశర్మ అనే యువకుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం జలంధర రాజ్యంలో సుశర్మ అనే యువకుడు ఉండేవాడు. వాడికి జీవితంలో ఒకే ఒక వ్యసనం ఉండేది. అదేమిటంటే, శిల్పాలు చెక్కటం చూడటం. వాడు రోజూ శిల్పాలు చెక్కే చోటికి వెళ్ళి, వాళ్ళు చేసే పని చూసి

## బేతాళ కథలు

ఆనందిస్తూ రోజంతా ఆకలి దప్పులు కూడా మరిచి, గడిపేవాడు. శిల్పులు వాణ్ణి చాలా రోజులు చూసిన మీదట, "నీకు శిల్పకళ మీద అంత మోజు ఉంటే రాజుగారు ఏర్పాటు చేసిన శిల్ప విద్యాలయంలో చేరి పని నేర్చుకోరాదా?" అని అడిగారు.

సుశర్మ శిల్ప విద్యాలయానికి వెళ్ళి, తనను అందులో చేర్చుకోమని అక్కడి కులపతిని అడిగాడు.

"నాయనా, నువు శిల్పుల శ్రేణికి చెందినవారి కొడుకువు అయితేనేగాని నీకు ఈ విద్యాలయంలో ప్రవేశం ఉండదు." అని కులపతి సుశర్మకు తెలిపాడు.

సుశర్మ నిరాశ చెంది వెళ్ళి, రాజుతో ఫిర్యాదు చేశాడు.

రాజు అతని ఆవేదన చూసి, "అలాటి పాత నియమం ఉండేది. కాని ఆనాటి శ్రేణులు విచ్ఛిన్నమయాయి. నీకు విద్యాలయంలో ప్రవేశం నేను ఇప్పిస్తాను. కాని నువు మాత్రం నీ విద్యను మన దేశ ప్రజలకే ఉపయోగించేలాగా చూడాలి." అన్నాడు.

"అలాగే చూస్తాను." అని మాట ఇచ్చి, సుశర్మ శిల్పవిద్యాలయంలో చేరి, శిల్ప విద్యను ఆమూలాగ్రం అభ్యసించాడు.

"ఇంక నువు నేర్చుకునేది ఏమీ లేదు. శిల్పవృత్తి చేపట్టవచ్చు." అని కులపతి సుశర్మతో చెప్పాడు.



సుశర్మ రాజు వద్దకు వెళ్ళి, "మహా రాజా, మన విద్యాలయం చెప్పగలిగి నంత మేరకు శిల్పరహస్యాలు అన్నీ తెలుసుకున్నాను. కాని నాకు తృప్తి కలగలేదు. ఇంకా తెలుసుకోదగిన రహస్యాలు చాలా ఉన్నాయని నా అను మానం. తమ సెలవైతే, నేను కొంతకాలం పాటు దేశాటనచేసి, నాకు తృప్తికలిగేదాకా శిల్పరహస్యాలను సేకరించి, తిరిగి వస్తాను," అన్నాడు.

రాజు అందుకు అనుమతించాడు.

సుశర్మ దేశదేశాలు తిరిగి ఎన్నో శిల్ప సంప్రదాయాలను తెలుసుకున్నాడు. అయితే అతను ఎక్కడా చూడనిదీ, విననిదీ అయిన శిల్ప సంప్రదాయం నిర్జనారణ్యం మధ్య ఒక పాడుపడిన దేవాలయంలో కనిపించింది.

సుశర్మ ఆకలి దప్పులూ, అరణ్య మృగాల భయమూ మరిచి, ఆ ఆలయం లోనే మకాం పెట్టి, అందులోని శిల్పాన్ని పరిశీలించసాగాడు. ఇంతలో అక్కడికి ఒక విచిత్రమైన వ్యక్తి వచ్చి, సుశర్మను గురించి అడిగాడు.

"నాకు అతి ప్రాచీనమైన శిల్ప సంప్రదాయాలు కూడా తెలుసును. కాని ఇలాటి శిల్పం ఏ యుగానికి చెందినదీ గ్రహించలేకుండా ఉన్నాను," అని సుశర్మ ఆ వ్యక్తితో అన్నాడు.

"ఇది కృతయుగం నాటిది. ఈ శిల్ప రహస్యాలు తెలిసిన వాళ్ళు భూమి మీద





ఒక్కరుకూడా లేరు.'' అన్నాడు వచ్చిన మనిషి.

సుశర్మ చాలా విచారం కనబరుస్తూ, ''ఎంత అన్యాయం!'' అన్నాడు.

''నువు నా వెంట పాతాళలోకానికి వస్తావా? నీకు ఆ రహస్యాలు తెలిసిన మహాశిల్పిని పరిచయంచేస్తాను,'' అన్నాడు ఆ మనిషి.

వెంటనే సుశర్మ ముఖం వికసించింది. అతను ఆ మనిషి వెంట పాతాళానికి వెళ్ళి, దానవుల శిల్పి అయిన మయుణ్ణి చేరుకున్నాడు. అతన్ని పాడుపడిన ఆలయం నుంచి పాతాళానికి తీసుకుపోయినవాడు కూడా దానవుడే.

మయుడు సుశర్మకు తన శిల్ప రహస్యాలన్నీ చెప్పాడు. సుశర్మ మయుడికి ధన్యవాదాలు తెలిపి, ఆయన వద్ద సెలవు పుచ్చుకుని భూమి మీదికి వచ్చాడు. అతను ఒక పర్వతమయ ప్రాంతంలో నుంచి పోతుండగా, చెక్కడానికి పనికివచ్చే శిలలు ఒకచోట కనిపించాయి. సుశర్మ అక్కడే నిలిచిపోయి, ఆ శిలల మీద మయుడి శిల్ప రీతులను ప్రయోగించసాగాడు.

ఆ సమయంలో ఆకాశమార్గాన పోతున్న దేవతల శిల్పి విశ్వకర్మ, కృతయుగం నాటి శిల్పాలను చెక్కుతున్న కలికాలపు మానవుణ్ణి చూసి ఆశ్చర్యపడి, కిందికి దిగివచ్చి, ''అయ్యా, ఈ నిర్జన ప్రదేశంలో, ఎవరికీ ఉపయోగపడని చోట ఈ శిల్పాలు ఎందుకు చెక్కుతున్నావు?'' అని అడిగాడు.

సుశర్మ తన కథ అంతా చెప్పి, ''అయ్యా, నేను ఇంకా పరిపూర్ణ శిల్పిని కాలేదు. తెలుసుకుంటున్నకొద్దీ ఇంకా తెలుసుకోవాలని ఉన్నది. నా జీవితమంతా శిల్ప రహస్యాలను తెలుసుకోవటంలోనే గడిపెయ్యదలిచాను. తమరెవరు?'' అన్నాడు.

''నేను విశ్వకర్మను,'' అన్నాడు విశ్వకర్మ.

సుశర్మ ఆయన ముందు సాష్టాంగ పడి, "నా పూర్వజన్మ పుణ్యంచేత కృత యుగంనాటి దానవ శిల్ప రహస్యాలు తెలుసుకున్నాను. నన్ను మీ శిష్యుడుగా స్వీకరించి, నాకు దేవ శిల్ప రహస్యాలు కూడా నేర్పి, ధన్యుణ్ణి చెయ్యండి," అన్నాడు.

"దుర్మార్గుడా! పాపీ! ఇదా నువ్వు చేస్తున్న పని! నువు ఇంతవరకు తెలుసుకున్న శిల్పరహస్యాలన్నీ వెంటనే మరిచిపో!" అని శపించి, విశ్వకర్మ అంతర్ధానమయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, విశ్వకర్మకు సుశర్మ మీద అంత ఆగ్రహం ఎందుకు వచ్చింది? ఎందుకు సుశర్మను అంత దారుణంగా శపించాడు? అతను దానవ శిల్ప రహస్యాలు తెలుసుకున్నాడనా? తన శిల్ప రహస్యాలు తెలుసుకోగోరాడనా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "విశ్వకర్మ ఆగ్రహానికీ, శాపానికీ కారణం వేరే ఉన్నది. సుశర్మ శిల్పిగా మార్గం తప్పిన దుర్మార్గుడు, రాజుకు మాట ఇచ్చి తప్పిన పాపి! అతను కొత్త శిల్పరీతులు నేర్చుకు వచ్చి, తన దేశప్రజలకు ఆ జ్ఞానాన్ని ఉపయోగ పడేలాగా చేస్తాడన్న ఉద్దేశంతో రాజు అతన్ని దేశాటన చెయ్యనిచ్చాడు. సుశర్మ విశ్వకర్మతో అన్న మాటలనుబట్టి, అతను యావజ్జీవమూ శిల్ప రహస్యాలు తెలుసుకోవటంలోనే గడపదలిచినట్టు స్పష్టమవుతున్నది. అది అత్యంత హీనమైన స్వార్థం. అతను యింతకాలంగా దేశాలుతిరిగిసంపాదించిన జ్ఞానంవల్ల మనుషులకు మేలు కలగబోదని నిశ్చయమైనాకనే విశ్మకర్మ శపించాడు. ఆ శాపం ఎంతైనా సమర్థనీయం," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






కొద్ది ఆస్తినీ, భార్యనూ, ఇద్దరు కొడుకులనూ విడిచిపెట్టి దీనానాథ్ దేహం చాలించాడు. పెద్దవాడు కాశీనాథ్, ఇరవై ఎనిమిదేళ్ళవాడు, ఆ ఊళ్లోనే జమీందారుగారి దివాణంలో శిస్తులు వసూలు చేసే ఉద్యోగంలో ఉన్నాడు. చిన్నవాడు నిశినాథ్ ఇంకా స్కూలులో చదువుకుంటున్నాడు.

కాశీనాథ్ స్వభావం మంచిది కాదు. తండ్రి పోగానే ఆస్తి పంపకంలో తమ్ముడికి అన్యాయం చెయ్యాలని అతను తలపెట్టాడు. అతను గ్రామపెద్దలను పిలిచి, తమ ఆస్తిని రెండు సమ భాగాలుగా విభజన చేయించాడు. తల్లికి చిన్న కొడుకంటే ఇష్టం గనకనూ, వాడికి కాచి పోసే దిక్కు అవసరం గనకనూ, కాశీనాథ్ తన తల్లిని చిన్న కొడుకు వెంట ఉండమనీ, ఆమె పోషణకుగాను తాను కొంత అదనంగా ఇస్తాననీ అన్నాడు.

ఇంటి ఆవరణలో ఒక ఆపిల్ చెట్టున్నది. దాని పళ్ళు చాలా మేలు జాతివి. వాటి రంగూ, వాసనా, రుచీ, అసాధారణమైనవి. ఆ ఆపిల్ చెట్టు సరిగా రెండు వాటాల మధ్య సరిహద్దు మీద ఉన్నది. కాశీనాథ్ నిజానికి సంపాదనపరుడు, తన సంపాదనతో భార్యాబిడ్డలను పోషించుకోగలడు. ఏ రాబడీ లేనివాడు నిశినాథ్. అందుచేత గ్రామ పెద్దలు కాశీనాథ్‌తో ఆపిల్ చెట్టును నిశినాథ్‌కు వదిలెయ్యమన్నారు. కాశీనాథ్ అందుకు ఒప్పుకోలేదు. చెట్టున కాసే పళ్ళలో నిశినాథ్‌కు సగం వాటా ఇయ్యమన్నారు పెద్దలు.

''పళ్ళేం ఖర్మం? చెట్టునే నరికి కట్టెలు కొట్టి చెరిసగం తీసుకుంటే

ఎ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

పోలా?'' అన్నాడు కాశీనాథ్, అక్కడి నుంచి వెళ్ళిపోతూ.

''మరీ మొండికెత్తాడు! వెలివేస్తే రోగం వదులుతుంది,'' అన్నాడు ఒక పెద్ద ఆవేశంగా.

''అయ్యో, అంతపని చెయ్యకండి. నాకు ఆ చెట్టూ, పళ్ళూ లేకపోతే మానె! నాకు దేవుడిలో నమ్మకం ఉన్నది. కష్టం వస్తే నన్ను దేవుడే ఆదుకుంటాడు,'' అన్నాడు నిశినాథ్.

''సరే అలాగే కానీ. మేం నిన్ను ఏ విధంగానూ ఆదుకునే దారి లేదు,'' అన్నారు పెద్దలు.

రోజులు గడిచాయి. తన వంతు ఆస్తి మీద వచ్చే కొద్ది ఆదాయంతో నిశినాథ్ ఎలాగో గడుపుకుంటూ వచ్చాడు. అతను శ్రద్ధగా చదువుకుని, స్కూలు చదువు పూర్తి చేసి, పై చదువులకు పట్నం వెళ్లాడు. గ్రామం నుంచి పట్నానికి మూడు మైళ్ళు కాలినడకన వెళ్ళి రావాలి. సైకిల్ ఉంటే చాలా సౌకర్యంగా ఉంటుంది. కాని సైకిల్ కొనటానికి అతని వద్ద డబ్బులేదు.

ఆపిల్‌పళ్ళ తరుణం వచ్చింది. దొడ్లో ఉన్న చెట్టు విరగ కాసింది. కాపులో తనకు సగం వాటా వచ్చినా పళ్ళు అమ్మి సైకిల్ కొనుక్కోవచ్చు.



''దేవుడా, నీదే భారం,'' అనుకున్నాడు నిశినాథ్.

ఒక వారం అనంతరం కాశీనాథ్‌కు అకస్మాత్తుగా జబ్బుచేసి, వైద్యులకు రోగం అంతుచిక్కక, అతను చావు బతుకుల మధ్య ఊగిసలాడాడు. తన అన్న కోలుకోవాలని నిశినాథ్ దేవుడికి మొక్కుకున్నాడు. అన్న బతకాలని చాలా తపనపడ్డాడు. అతని ప్రార్థనల ఫలితమో ఏమోగాని, కాశీనాథ్ రోగం తిరుగుముఖం పట్టింది. అతను త్వరలోనే కోలుకున్నాడు గాని, బాగా డీలా పడిపోయాడు. మానసికంగా కూడా బాగా దెబ్బతిన్నాడు.



ఊరి పెద్దలు అతని వద్దకు వచ్చి, "చూడు, కాశీనాథ్! చచ్చి బతికావు. దేవుడు నిన్ను కాపాడాడు. ఆ ఆపిల్‌చెట్టు నీ తమ్ముడికి ఇయ్యి. మీ అమ్మ కూడా అనుభవిస్తుంది. పరాయి వాళ్ళు కారు గద!" అన్నారు.

"నన్ను బతికించిన దేవుడు నిశకి ఆపిల్‌చెట్టు ఇప్పించలేకపోతాడా? మధ్య నేనెవణ్ణి?" అన్నాడు కాశీనాథ్.

పెద్దల వెంట వచ్చినవారిలో నిశనాథ్ సహాధ్యాయి, హరకుమార్ అనేవాడు, "అయితే, నువు దేవుడి నిర్ణయానికి కట్టుబడతావా?" అని అడిగాడు కాశీనాథ్‌ను.

"ఆ చెట్టు ఎవరికి చెందాలో దేవుడు నిర్ణయించే మాటుంటే తప్పక ఆ నిర్ణయానికి కట్టుబడతాను." అన్నాడు కాశీనాథ్.

"అలా అని నీ కొడుకు రామనాథ్ మీద ఒట్టుపెట్టుకో." అన్నాడు హరకుమార్.

"నిశ్చయంగా." అన్నాడు కాశీనాథ్.

అందరూ ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు.

"మీ అన్న తాను చేసిన ప్రమాణం మీద నిలబడితే ఆపిల్‌చెట్టు నీదే అనుకో!" అన్నాడు హరకుమార్ నిశనాథ్‌తో.

"దేవుడు నన్ను అనుగ్రహించటానికి నేను అంతటి భక్తుణ్ణా?" అని అడిగాడు నిశనాథ్.

"దేవుడు స్వయంగా ఏమీ చెయ్యడు. కాని తాను తెలివి తేటలు ఇచ్చిన వాళ్ళ ద్వారా చేయిస్తాడు. నీ విషయం మన సహాధ్యాయి అయిన నకుల్‌తో చెబుతాను. వాడు ఇంద్రజాలం తెలిసినవాడు. నీ సమస్య తేల్చేస్తాడు." అన్నాడు హరకుమార్.

రెండు రోజుల అనంతరం ఊరిపెద్దలు కాశీనాథ్ ఇంట, ఆపిల్ చెట్టు కింద చేరారు.

హరకుమార్ లేచి నిలబడి, '' ఈ చెట్టు సశికి చెందాలన్నది దేవుడి ఉద్దేశమైతే అందుకు తగిన దాఖలా చెట్టులోనే, పళ్ళలోనే కనబడక తప్పదు. నేను చెట్టెక్కి రెండు మూడు పళ్ళు కోసు కొస్తాను. దాఖలా దొరుకుతుందేమో చూతాం,'' అన్నాడు.

అతను చెట్టుకు నమస్కారం చేసి, పైకి ఎక్కి, వేరు వేరు కొమ్మల నుంచి రెండు, మూడు పళ్లు కోసి, వాటిని తన జేబులో వేసుకుని దిగి వచ్చాడు. అతను జేబులోనుంచి పళ్ళు తీసి అక్కడచేరిన వారందరికీ చూపాడు. వాటిని చూస్తే ప్రత్యేకంగా '' దాఖలా '' అంటూ ఏమీ కనిపించలేదు.

''పళ్ళ లోపల ఏమన్నా దాఖలా దొరుకుతుందేమో చూతాం,'' అని హర కుమార్ కాశీనాథ్ చేతికి ఒక ఆపిల్ పండూ, కత్తీ ఇప్పించి, దాని తొక్క తీసి, లోపల ఏమైనా దాఖలా దొరుకు తుందేమో చూడమన్నాడు.

కాశీనాథ్ ఆపిల్‌పండు తొక్క తీసే సరికి, లోపలి పండు రెండుగా చీలి ఉన్నది. ఇంకో పండు తొక్క తీసి చూస్తే, అది కూడా అలాగే రెండు భాగాలుగా చీలి ఉన్నది!

''ఆహా, దేవుడి మహిమ! అద్భుతం!'' అన్నారు అందరూ.

ఊరి పెద్దలలోకెల్లా వృద్ధుడు కాశీ నాథ్‌తో, ''బాబూ, ఇది దైవనిర్ణయం.



ఇప్పుడైనా ఆపిల్‌చెట్టును నీ తమ్ముడి కిస్తావుగా ?'' అన్నాడు.

"మీ యిష్టం! ఇప్పుడింక ఎలా కాదనేది? నా కొడుకు మీద ఒట్టు పెట్టుకుంటిని గద! ఆ చెట్టు ఇక నిశిదే!'' అన్నాడు కాశీనాథ్.

నిశినాథ్ ఆ చెట్టు పళ్ళు అమ్మి సైకిల్ కొనుక్కున్నాడు.

ఒకనాడు అదే సైకిల్ మీద అతను హరకుమార్‌ను ఎక్కించుకుని పట్టణానికి పోతూ, "ఆపిల్ లోపల రెండుగా ఎలా కోసి ఉన్నదో నాకు అంతుబట్టలేదు. దేవుడు నన్ను నిజంగా అనుగ్రహించాడా?" అని అడిగాడు.

''నువు అంత పుణ్యాత్ముడివేమీ కాదు. ఇదంతా మన మిత్రుడు నకుల్ పని!'' అన్నాడు హరకుమార్.

"ఎలా చేశాడు?'' అని నిశినాథ్ అడిగాడు.

"వాడి కోరిక మీద నేను రాత్రివేళ మీ చెట్టునుంచి కొన్ని ఆపిల్‌పళ్ళు ఎవరూ చూడకుండా కోసుకుపోయాను. తరవాత సూదిలోకి బలమైన దారం ఎక్కించి, సూదిని పండు చర్మం దిగువన అడ్డంగా గుచ్చి, దాన్ని చర్మం కిందుగానే జరుపు కుంటూ పండు అవతలి పక్కకు తీసుకు పోయాను. తరవాత ఆ సూదిని రెండో వేపుగా, చర్మం దిగువగా మొదట గుచ్చిన చోటికి తీసుకుపోయాను. అంటే పండు చర్మం దిగువన దారం పండును చుట్టి వచ్చిందన్నమాట. తరవాత దారం రెండు కొసలూ పట్టుకుని లాగాను. పండు లోపలి భాగాన్ని దారం రెండుగా చీల్చి, బయటికి వచ్చింది. తరవాత పండును గుడ్డతో రుద్ది మెరుగుపెట్టిన మీదట, సూది చేసిన బెజ్జాలు కనపడ కుండా పోయాయి. ఇలా సిద్ధం చేసు కున్న ఆపిల్ పళ్ళు తీసుకుని చెట్టెక్కి, నేను చెట్టు నుంచి కోసిన పళ్ళకు బదులు సిద్ధంచేసి ఉంచిన వాటిని బయటికి తీసి, అందరికీ చూపాను.'' అన్నాడు హరకుమార్.






# గుట్టు రట్టు

ఆనందుడు కోమటి గుమాస్తా. వాడు కామాక్షిని పెళ్ళి చేసుకుని కాపరానికి తెచ్చుకున్నాడు. వచ్చిన రోజునే వాడు కామాక్షితో, "నేను కొట్టుకు పోతున్నాను. ఒక మెల్లకన్ను ముసలిముండ ఉన్నది ఊళ్ళో, దాన్ని లోపలికి రానీయకు," అని హెచ్చరించాడు.

కామాక్షి ఇంటి పని అంతా పూర్తి చేసుకుని, వీధి గదిలోకి వచ్చి, కిటికీ గుండా చూసేసరికి, ఒక మెల్లకన్ను ముసలిది, ఇంటి ముందు తచ్చాడుతూ వీధిలో కనిపించింది. ఆమె చప్పున కిటికీ తలుపు మూసేసింది.

ఆనందుడు చీకటిపడి ఇంటికి వస్తూనే, కామాక్షి ముసలిదాన్ని లోపలికి రానియ్యనందుకు సంతోషించి, "పొరపాటున కూడా దాన్ని చేరదీయవద్దు," అని భార్యను మళ్ళీ హెచ్చరించాడు.

రోజూ ముసలిది ఆ ఇంటి ముందు తచ్చాడుతూ ఉండేది. కామాక్షి చూసి చూడనట్టు ఊరుకునేది. అయితే, కామాక్షికి ఒక రోజు పెద్ద అనుమానం వచ్చింది: ఆ నడుము వంగిపోయిన ముసలి దాని మీద తన భర్తకు అంత పగ దేనికి? ఒకటికి రెండుసార్లు హెచ్చరించాడు. దాన్ని చేరనియ్యవద్దనటంలో గుట్టు ఏదో ఉండి ఉంటుంది!

ఈ అనుమానం రాగానే మరి ఆమె ఊరుకోలేక, తలుపు తెరిచి, ముసలిదాన్ని లోపలికి ఆహ్వానించింది. ముఖం చాటంత చేసుకుని, ముసలిది లోపలికి వచ్చి కూర్చుని, కామాక్షితో ఎంతో ఆదరంగా మాట్లాడింది.

ముఖం వికారంగా ఉన్నా ముసలిదాని మాటల్లో ఏదో ఆకర్షణ ఉన్నది. అది కామాక్షి పెట్టిన ఫలహారం తింటూ,

ఎం. కామేశ్వరరావు



"నువు చాలా మంచిదానివే, పిల్లా. నిన్ను చూస్తుంటే నా కడుపు తరుక్కు పోతున్నది. నీ మొగుడికి లేని దురల వాటు లేదు. ప్రతి సాయంత్రమూ, ఊరి చివర ఉన్న పాకలో జూదం ఆడి, చీకటి పడి ఇల్లు చేరుతాడు. నా మాట నమ్మకం లేకపోతే, సాయంత్రం స్వయంగా వెళ్ళి చూడు," అని చెప్పి, కాస్సేపు కూర్చుని వెళ్ళిపోయింది.

తన భర్త జూదగాడని తెలియగానే కామాక్షికి ముచ్చెమటలు పోశాయి. తన గుట్టు రట్టు అవుతుందనే భయంతోనే భర్త ముసలిదాన్ని చేరనీయవద్దన్నాడని ఆమె అనుకున్నది.

ఆ సాయంత్రం ఆమె తలుపులన్నీ మూసి, ఇంటికి తాళం పెట్టి, ఊరి చివర ఉన్న పాక దగ్గిరికి వెళ్ళి, లోపలికి తొంగి చూసింది. లోపల ఎవరో జూదం ఆడుతున్న మాట నిజమేగాని, వారిలో ఆనందుడు లేడు.

"ముసలిముండది కుళ్ళు బుద్ధిలా ఉంది. మొగుడు పెళ్ళాల మధ్య తంపులు పెట్టే రకం!" అనుకుని కామాక్షి ఇంటికి వచ్చి చూస్తే, పెరట్లో ఉండిన పాత్రలూ, బొక్కెనలూ మాయమయాయి. ఎవరో పెరటి గోడ దూకి వచ్చి ఎత్తుకుపోయి ఉండాలి.

చీకటిపడి భర్త రాగానే, ఆమె ఏడుస్తూ జరిగినదంతా దాచకుండా చెప్పి, "నీ మాట వినకుండా ముసలిదాన్ని లోపలికి చేరనిచ్చినందుకు మంచి శాస్తి జరిగింది," అన్నది.

"దొంగతనం కూడా ముసలిదాని పనే అయి ఉంటుంది. ఇలాటి పనులు చేయటానికి దానికో మనవడు ఉన్నాడు. అది చెడ్డదని అందరికీ తెలుసు. కాని దాన్ని ఎవరూ పట్టుకోలేకుండా ఉన్నారు," అన్నాడు ఆనందుడు.

కామాక్షికి ముసలిదాని పీక నులిమెయ్యాలన్నంత కోపం వచ్చింది. ఎలాగైనా దాని ఆటలు కట్టించాలనీ, దానికి

బుద్ధి చెప్పటానికి ఒక ఉపాయం అమలు చెయ్యాలనీ అనుకుని, ఆమె తన ఆలోచన భర్తకు చెప్పింది.

అప్పటికప్పుడు ఆమె ఒక పెట్టె చేత బట్టుకుని, ఇంటికి తాళంపెట్టి, ముసలి దాని ఇంటికి బయలుదేరింది. ఇంట్లో ముసలిదీ, దాని దొంగ మనవడూ ఉన్నారు. కామాక్షిని చూడగానే ముసలి దాని మొహం రంగులు మారింది.

"నువు నా భర్త గుట్టు బయటపెట్టి ఎంతో పుణ్యం కట్టుకున్నావు, అవ్వా. నేనా ఇంట్లో ఒక్క క్షణం కూడా కాపరం చెయ్యలేము," అంటూ కామాక్షి చీర చెంగు మొహాన కప్పుకుని ఏడుస్తున్నట్టు నటించింది.

తాను నోటికి వచ్చిన అబద్ధం ఆడితే అది నిజమయినందుకు ముసలిది సంతోషించింది.

కామాక్షి ముసలిదానితో ఇలా అన్నది:

"నా మొగుడు జూదగాడే కాదు, తాగుబోతు కూడాను. అర్థరాత్రిదాకా జూదం సాగుతుందిట. ఇంటికి తాళం పెట్టి వచ్చేశాను. తెల్లవారగానే బండి కట్టించుకుని మా ఊరు వెళ్ళిపోతాను. నువు మా ఇంటి దగ్గిర ఉండి, నా భర్త రాగానే ఈ తాళం చెవి ఇచ్చెయ్యి."

ముసలిది ఆ మాటలు నమ్మి, "నీ తల్లిలాటి దాన్ని! ఆ మాత్రం సాయం చెయ్యలేకపోతానా?" అంటూ తాళం చెవి తీసుకున్నది.



"తాగి వచ్చి నా భర్త నీ మీద చెయ్యి చేసుకుంటాడేమో. నీ మనవణ్ణి కూడా తోడు తీసుకువెళ్ళు." అన్నది కామాక్షి.

ఆ ఆలోచన ముసలిదానికి ముందే వచ్చింది. కామాక్షి నోటిమీదుగా అదే మాట వచ్చినందుకు ఆమె ఎంతో సంతోషించి, తన మనవడితో సహా కామాక్షి ఇంటికి బయలుదేరింది. అర్ధ రాత్రి దాకా ఇంటి వాడు రాడు. తన రొట్టె విరిగి నేతిలో పడింది! ఇల్లు పూర్తిగా చక్కబెట్టెయ్యవచ్చు.

ఇద్దరూ చీకటి మాటున తలుపు తెరుచుకుని లోపలికి వెళ్ళి, అన్నీ మూట గట్టుకున్నారు. తరవాత ఇద్దరూ దొడ్డి దారిన వెళ్ళ నిశ్చయించి. మూటలు చంకన పెట్టుకుని, పెరటి తలుపు తెరిచి, అలాగే కొయ్యబారిపోయారు.

పెరట్లో పదిమంది మనుషులు కర్రలతోనూ, దీపాలతోనూ నిలబడి ఉన్నారు. అది చూసి ముసలిదీ, దాని మనవడూ వీధి వాకిలి వేపు పరిగెత్తు కొచ్చారు. అక్కడ ఆనందుడు మరో పదిమందితో సిద్ధంగా ఉన్నాడు.

"ఇంత కాలానికి మీరు దొంగతనం చేస్తూ పట్టుబడిపోయారు. మీ పాపం పండింది. మర్యాదగా లొంగిపొండి." అన్నాడు ఆనందుడు

తన్నులకు భయపడి, ఇద్దరూ లొంగి పోయారు. అందరూ వాళ్ళను వెంట తీసుకుని వాళ్ళ ఇంటికి వెళ్ళారు. ఈ లోపుగా కామాక్షి ఇంట్లో ఉన్న సామానంతా తెచ్చి ముందు గదిలో పెట్టింది. అది అంతా దొంగ సొత్తే! వచ్చిన వాళ్ళలో చాలామంది పోగొట్టు కున్న వస్తువులూ, బట్టలూ అందులో ఉన్నాయి. ఎవరివి వాళ్ళు తీసేసు కున్నారు. కామాక్షి తమ గిన్నెలూ, బొక్కెనలూ తాను తీసుకున్నది.

ముసలిదాన్నీ, దాని మనవణ్ణీ పోలీసులకు అప్పగించి, ఊరందరూ చెయ్యలేని పని చేసినందుకు కామాక్షిని అంతా మెచ్చుకున్నారు.



# వరపరీక్ష

అతిలోకసుందరి అయిన అవంతీ రాజకుమార్తెకు భర్తను నిర్ణయించటానికి ఒక పరీక్ష పెట్టారు. ఇందుకు ఆహ్వానం మూడుదేశాల రాజకుమారులకే పంపబడింది.

అవంతీరాజు ముగ్గురినీ ఒక కుక్కలదొడ్డి వద్దకు తీసుకుపోయి, "ఈ కుక్కలన్నీ వర పరీక్షలో ఓడిపోయిన రాజకుమారులు. పరీక్ష ఏమంటే, తూర్పున ఉన్న కొండలోని గుహలోకి ప్రవేశించి తిరిగి రావాలి," అన్నాడు.

ఈ మాట వింటూనే ముగ్గురిలో ఒకడు విరమించుకుని, ఇంటిదారి పట్టాడు. మిగిలిన ఇద్దరూ కొండ కేసి బయలుదేరారు. వాళ్ళు గుహను సమీపించబోతూండగా గుహలో కుక్క మొరగటం వినిపించింది. ఇద్దరిలో ఒకడు తన గుర్రాన్ని వెనక్కు తిప్పి వెళ్ళిపోయాడు.

మిగిలిన రాజకుమారుడు సాహసంతో గుహ ప్రవేశించాడు. అక్కడ రాజకుమార్తె అతన్ని ఆహ్వానించి, అతని మెడలో వరమాల వేసింది.

—ఎం. మనోహరరెడ్డి.






ఒక జమీందారు దగ్గిర చెన్నయ్య అనే తోటమాలీ, కన్నయ్య అనే ఇంటి పని చేసేవాడూ ఉండేవాళ్ళు. ఇద్దరూ ఇంచుమించు ఒకసారే వచ్చి చేరారు. ఇద్దరికీ కొంచెం కూడా పడేదికాదు.

ఒకరోజు జమీందారు కన్నయ్యను వెంటబెట్టుకుని తోటలోకి షికారుగా వచ్చాడు. అప్పుడు చెన్నయ్య చెట్లకి నీళ్ళు కట్టుతున్నాడు. జమీందారు కాస్సేపు పచార్లు చేసి వెళ్ళిపోయాడు. కన్నయ్య కూడా ఆయనతోనే వెళ్ళాడు. వాళ్ళు నిలిచినచోట చెన్నయ్యకు, ధగధగా మెరుస్తూ, ఏదో కనిపించింది. దగ్గిరికి పోయి చూస్తే అది జమీందారుగారి రవ్వల ఉంగరం.

"పొరపాటున జారిపడి ఉంటుంది! ఇది నాకు దొరికింది గనక సరిపోయింది గాని, ఆ కన్నయ్య చేతికి చిక్కి ఉంటే ఇంకేమైనా ఉన్నదా?" అనుకున్నా చెన్నయ్య.

అంతలో వాడికొక తెలివైన ఆలోచ తట్టింది. వాడు అటూ ఇటూ చూ ఉంగరాన్ని చప్పన బొడ్డులో దోపుకు ఆ రాత్రి అందరూ నిద్రపోతూండగ కన్నయ్య గది కేసి వెళ్ళాడు.

చెన్నయ్యకు అనుకూలంగా కన్నయ గది తలుపులు వారగా తెరిచిఉన్నాయ చెన్నయ్య లోపలికి తొంగిచూశా కన్నయ్య ఇంకా పడుకోలేదు; పెట్టెలో ఏదో వెతుకుతున్నాడు. చివర కన్నయ్య పెట్టెలోనుంచి ఏదో వస్తు బయిటికి తీసి గుప్పిట్లో ఉంచుకు వాకిలి కేసి రాసాగాడు.

చెన్నయ్య పక్కకు తప్పుకు కన్నయ్యను బయటికి పోనిచ్చి, లాగా గదిలోకి జొరబడి, ఉంగరా

వీరేపల్లి జయరాంరెడ్డి

కన్నయ్య పెట్టె అడుగున పెట్టి, బయటికి వచ్చాడు.

అప్పుడు వాడి బుర్ర ఇతర విషయాలను గురించి ఆలోచించగలిగింది. ఇంత రాత్రివేళ కన్నయ్య ఎక్కడికి బయలుదేరాడు? వాడి గుప్పిట్లో వున్న వస్తువు ఏమైవుంటుంది? చెన్నయ్య అతివేగంగా కన్నయ్య వెళ్ళినవైపే తాను కూడా బయలుదేరాడు.

కన్నయ్య తోటలోకి పోయి, కాలవ ఒడ్డున ఉన్న పెద్ద చెట్టు తొర్రలో ఏదో దాచిపెట్టాడు. సాధారణంగా చెన్నయ్య ప్రతిరోజూ స్నానం చెయ్యబొయ్యేటప్పుడు బట్టలు ఆ తొర్రలో పెట్టుతుంటాడు. ఆ తొర్రలో కన్నయ్య ఏమి దాచాడో చూడాలనిపించింది చెన్నయ్యకు. కన్నయ్య తిరిగి వెళ్ళగానే చెన్నయ్య చెట్టు కేసి నడిచాడు. అయితే అంతలోనే వాడినెత్తిన బలంగా దెబ్బపడింది. వాడు స్పృహతప్పి పడిపోయాడు.

తిరిగి తెలివి వచ్చేసరికి చెన్నయ్య తన గదిలో పడి ఉన్నాడు. కన్నయ్యే, తనను గమనించి, వెనక నుంచి కొట్టి ఉంటాడనీ, తెల్లవారినాక వాడి అంతు తేల్చాలనీ అనుకున్నాడు.

మర్నాడు జమీందారు తన నౌకర్లనిద్దరినీ పిలిచి, "నా చేతికి కట్టుకునే



బంగారు గొలుసు ఎవరో కాజేశారు. ఆ పని చేసే అవకాశం మీ ఇద్దరికే ఉన్నది. మీలో ఎవరు ఆ పని చేశారో చెప్పకపోతే ఇద్దరి తోలూ వలుస్తాను." అని గదమాయించాడు.

ఆ మాట విని చెన్నయ్య ఆశ్చర్యపడ్డాడు. వేలి ఉంగరం పోగొట్టుకుని చేతి గొలుసు పోయిందంటాడేమిటి జమీందారు? కాని కన్నయ్య మాత్రం సంకోచం లేకుండా, "దొంగ చెన్నయ్యే! వాడు రాత్రి తోటలో ఏదో దాచిపెట్టుతూంటే కళ్ళారా చూశాను. రండి, చూపిస్తాను!" అంటూ, జమీందారును వెంటబెట్టుకుని, చెట్టు దగ్గిరికి వెళ్ళాడు.

కాని చెట్టుతొర్రలో చెయ్యిపెట్టి తడివి కన్నయ్య తత్తరపడుతూ, "ఇక్కడే దాచిపెట్టానే? ఎలా పోయింది?" అనుకున్నాడు.

కన్నయ్య ఎత్తు చెన్నయ్యకు అర్థమయింది. తన మీద దొంగ తనం మోపటానికి జమీందారుగారి గొలుసు తీసి, వాడు తొర్రలో దాచాడు. కాని ఇంకెవరో దొంగవెధవ తనను వెనకపాటుగా కొట్టి, ఆ గొలుసు కాస్తా ఎత్తుకుపోయాడు!

చెన్నయ్యకు కన్నయ్య మీద పట్టరాని కోపం పుట్టుకొచ్చింది. వాడు జమీందారుతో, "గొలుసు దొంగ ఎవరో నాకు తెలుసు. అసలు మీకు మీ ఉంగరం మాట గుర్తులేనట్టుంది. రెంటినీ కాజేసినది కన్నయ్యే! ఇలారండి." అంటూ జమీందారును కన్నయ్య గదికి తీసుకుపోయి, పెట్టె గల్లంతుచేసి చూశాడు. కాని అందులో ఉంగరం లేదు! "ఇందులోనే వేశానే? ఏమయింది?" అని చెన్నయ్య బిత్తరపోయాడు.

అది చూసి జమీందారు నవ్వుతూ, జేబులో నుంచి చెయ్యి తీసి, "ఇదుగో గొలుసు! ఇదుగో రవ్వల ఉంగరం!" అని వాళ్ళకు చూపాడు.

నౌకర్లిద్దరి ముఖాలూ పాలిపోయాయి.

"మీ ఇద్దరినీ పరీక్షించటానికే నేను నాటకం ఆడాను. నా ఉంగరమూ, గొలుసూ మీలో చెరొకరి కళ్ళా పడేటట్టు చేశాను, వాటిని తెచ్చి నాకు ఇస్తారో, లేదో చూద్దామని! మీరు వాటిని కాజెయ్య లేదుగాని, వాటి సహాయంతో మీరిద్దరూ చెరొకరిని దొంగగా నిరూపించి, నా పట్ల మీకు విశ్వాసం ఎక్కువ ఉన్నట్టు నిరూపించుకునేటందుకు ప్రయత్నించారు. మీలో నిజాయితీ ఉండవచ్చుగాని, మీ మధ్య అన్యోన్యతలేదు. అందుచేత నాకు మీ మూలంగా లేనిపోని చిక్కులు వస్తాయి. వెళ్ళిరండి." అన్నాడు జమీందారు.

తలలు వంచుకుని నౌకర్లిద్దరూ వెళ్ళిపోయారు.





# ఉడతకుచారలు

ఒక గ్రామంలో విద్యానాథు డనే మహా పండితుడు ఒక గురుకులాన్ని నడిపేవాడు. దాని ఖ్యాతి విని ఎంతో దూర ప్రాంతాల నుంచి కూడా విద్యార్థులు అక్కడికి వస్తూండేవారు.

విద్యానాథుడి కొడుకు బృహస్పతి తండ్రికి ఏమాత్రమూ తీసిపోని పండితుడుగా తయారయాడు. త్వరలో తన స్థానం తన కొడుక్కు ఇయ్యాలని నిశ్చయించి విద్యానాథుడు, "నాయనా, నీకు విద్య పూర్తిగా అబ్బింది. ఇక లోకజ్ఞానం కావాలి. లోకం పోకడా, మనుష్యులు జీవించే పద్ధతీ తెలుసుకుంటేగాని, నీ జ్ఞానాన్ని విద్యార్థులకు ఉపయోగపడేలా చెయ్యలేవు. అందుచేత కొంతకాలం దేశాటన చేసి, అవసరం అయిన లౌకికజ్ఞానం సంపాయించి, తిరిగిరా," అన్నాడు.

వెంటనే బృహస్పతి గ్రామాల వెంట తిరిగి, ప్రజల వాస్తవ జీవితాన్ని శ్రద్ధగా పరిశీలించుతూ, పుస్తకాలలో చెప్పని ఎన్నో విషయాలు తెలుసుకోసాగాడు. కొన్నిచోట్ల అతనికి ఆశ్చర్యకరమైన సంఘటనలు ఎదురయాయి.

ఒక గ్రామంలో కొందరు కండలు తిరిగిన వస్తాదులు ఒక బలహీనుడికి పాద పూజలు చేస్తూ, "మహాబలుడికి జయము! జయము!" అని నినాదాలు చెయ్యడం బృహస్పతి గమనించాడు. అతను ఆ విడ్డూరానికి కారణం ఏమని విచారిస్తే, అతనికి ఈ కింది విషయం తెలిసింది.

ఒకప్పుడా గ్రామంలో మహాబలు డనే వాడు ఉండి, ఆ గ్రామాన్ని అనేకసార్లు విపత్తులనుండి కాపాడాడు. చుట్టుపక్కల అరణ్యాల నుంచి క్రూరమృగాలు

"వసుంధర"

వచ్చి గ్రామం మీద పడితే వాటిని ఒంటరిగా ఎదిరించి చంపాడు. ఒకసారి దుర్ముఖు డనే రాక్షసుడు ఆ గ్రామాన్నే గాక, చుట్టుపక్కల గ్రామాలను కూడా పీడించటం మొదలుపెట్టితే, మహా బలుడు మహాకాళికి పూజలు చేసి, దుర్ముఖుణ్ణి ఎదుర్కొని ఘోర యుద్ధం చేసి, చివరకు వాణ్ణి చంపాడట. అటు తరవాత ఆ ప్రాంతాల అనేక గ్రామాల వారికి మహాబలు డంటే అమితమైన అభిమానం ఏర్పడింది. ముఖ్యంగా బలశాలులకు అతను ఆరాధన దైవం అయాడు. వాళ్ళు దుర్ముఖుడు మర ణించిన రోజు పర్వదినంగా భావించి, ఆ రోజు మహాబలుడికి పాదపూజ చేస్తూ వచ్చారు. మహాబలుడు పోయాడు. కొన్ని వందల సంవత్సరాలు గడిచాయి. అయినా ఆ పర్వదినంరోజు మహాబలుడి సంతతివాడికి పాదపూజ జరుగుతూనే ఉన్నది.

పూర్వీకుల గొప్పతనాన్నిబట్టి మనుషు లను ఆరాధించటం, బృహస్పతి ఇంకా అనేక సందర్భాలలో చూడటం జరిగింది. అయితే అందుకు విరుద్ధమైన సంఘటన కూడా అతనికి మరో గ్రామంలో ఎదురయింది.

అతను ఆ ఊరి పెద్ద వితండుడి ఇంట్లో బసచేశాడు. విద్యానాధుడి కీర్తి దేశ మంతటా వ్యాపించి ఉండటంచేత, ఆయన కొడుకైన బృహస్పతికి వెళ్ళిన



చోటనల్లా గౌరవం జరిగింది. అలాగే వితండుడు బృహస్పతితో, '' మహాశయా, ఈ రోజు మా గ్రామానికి ఆస్థానకవిని ఎన్నుకుంటున్నాం. తమవంటి పండితుల సమక్షంలో ఆ ఎన్నిక జరిగిందంటే మా గ్రామస్థులందరికీ ఎంతో తృప్తి. తమరు కూడా అక్కడికి రావాలి,'' అంటూ ఆహ్వానించాడు.

బృహస్పతి అందుకు సరేనని ఆయనతో బయలుదేరి వెళ్ళాడు.

ఆస్థానకవి పదవి కోసం ఆరుగురు వచ్చారు. అందులో ఇద్దరే ఆశువుగా కవిత్వం చెప్పగలవాళ్ళు. అందులో ఒకడు తాను రచించిన మూడు కావ్యాలను వెంట తెచ్చాడు. ఆ కవిని చూసి వితండుడు అకస్మాత్తుగా, '' నువు అంబరుడివి కాదూ ? '' అన్నాడు.

అతను అవునని తల ఆడించాడు.

'' అంబరుడైతే ఆస్థానకవి పదవికి కనీసం అయిదు కావ్యాలైనా రాసి ఉండాలి,'' అని వితండుడు రెండో ఆశుకవిని ఆస్థానకవిగా నిర్ణయించాడు.

బృహస్పతి ఈ వింత ఎన్నికకు ఆశ్చర్యపడి, '' అయ్యా, అంబరుడు అతని పేరా? అతను చేసిన తప్పు ఏమిటి ? '' అని వితండుణ్ణి అడిగాడు. అతను తెలుసుకున్నది ఇది :

అంబరుడు అన్నది మనిషి పేరు కాదు; జాతి పేరు. తాము ఆకాశం నుంచి ఊడి పడ్డామని ఈ జాతివాళ్లు ఒకప్పుడు ఆ పేరు



పెట్టుకున్నారు. చదువుకునే అర్హత తమకే ఉన్నదనీ, మిగిలినవారంతా కాయకష్టం చేసి బతకాలనీ వాళ్ళు అన్నారు. వాళ్ళు రాజుల ప్రాపకం సంపాదించి, తమ జాతిని మిగిలిన జాతులన్నీ పూజించాలన్నారు; కొన్నిజాతులను అస్పృశ్యులుగా ప్రకటించారు; ప్రజలను నానాహింసలూ పెట్టారు. కొంతకాలానికి రాజ్యంలో చాలామార్పులు ఏర్పడ్డాయి. ప్రజలే ఏలికలయారు. అప్పటినుంచీ అంబరుల మీద అనేక ఆంక్షలు విధించబడ్డాయి. ఇప్పటి అంబరులలో తాము అధికులమన్న అహంకారం ఏమీ లేదు. కాని వాళ్ళ పూర్వీకులు చేసిన తప్పుకు అంబరులకు కలకాలం కష్టాలుంటాయి.

బృహస్పతి ఒక సంవత్సరంపాటు దేశాటన చేసి, లోకజ్ఞానం సంపాదించి ఇంటికి తిరిగి వెళ్ళి, తన తండ్రి నడిపే గురుకులానికి తానే అధిపతి అయాడు.

ఒకనాడు అతను శిష్యులకు ఉడత భక్తి గురించి చెబుతూ, రాముడు వారధి కట్టేటప్పుడు ఉడత చేయాలనుకున్న సహాయానికి మెచ్చుకుని, ఆయన దాన్ని వేళ్ళతో రాచాడు. ఆ చారలు ఇప్పటికీ ఉడత జాతికి ఉన్నాయని అన్నాడు.

ఇందుకు ఒక శిష్యుడు అభ్యంతరం చెబుతూ, "సహజ లక్షణాలు జాతికి సంక్రమిస్తాయి గాని, కృత్రిమంగా ఏర్పడిన లక్షణాలు ఎలా సంక్రమిస్తాయి, గురువుగారూ? మా నాన్నకు చిన్నతనంలో నుదుటి మీద గాయమై, మాని మచ్చకట్టింది కాని ఆ మచ్చ మా కెవరికీ రాలేదు," అన్నాడు.

బృహస్పతి ఆ మాటకు నవ్వి, "నేను చెప్పిన దానిలో నీతి అది కాదు. ఉడత చారలు పైకి కనిపిస్తున్నాయి. కాని మానవ జాతులలో, ఒక జాతి చేసిన మంచిగాని, చెడుగాని ఆ జాతి మీద శాశ్వతంగా కనపడని ముద్ర వేస్తుంది," అని తాను ప్రత్యక్షంగా చూసిన మహాబలుడి పాద పూజ గురించీ, అంబరుడి కథ గురించీ చెప్పాడు.



# అసూయ

ఒక ఊళ్ళో రాముడూ, రంగడూ అనే ఇద్దరు రైతు లుండేవారు. రంగడు పేదరైతు. రాముడు మోతుబరిరైతు.

ఒకసారి రంగడు తన పొలంలో కంద వేశాడు. ఆ యేడు విడ్డూరంగా అతని పొలంలో ఏనుగంత కందదుంప అయింది. దాన్ని అతను రాజుగారికి తీసుకుపోయి బహుమానంగా ఇచ్చాడు. ఆ కందదుంపను చూసి రాజు నిర్ఘాంతపోయి, రంగడికి బోలెడంత ధనం ఇచ్చాడు.

ఈ సంగతి విని రాముడు అసూయపడి, ఏను గంత కందదుంపకే ఇంత బహుమానం ఇచ్చిన రాజుకు ఏనుగును బహూకరిస్తే, ఇంకెంత ఇస్తాడోగదా అని, ఏనుగును కొని రాజుగారికి ఇచ్చాడు.

"ఇతనికి ఏమి బహుమానం ఇస్తాం?" అని రాజు మంత్రిని అడిగాడు.

"ఏనుగును బహూకరించగల వాడికి డబ్బు దేనికి? కందదుంపను ఇచ్చి పంపండి," అన్నాడు మంత్రి.

రాజు రంగడి కందదుంపను రాముడికి బహూకరించాడు. —కె. రాజగోపాల్





# వీడిపోయిన నిద్రమత్తు

పాలేరు పోలయ్యకు లేక లేక ఒక కొడుకు పుట్టాడు. వాడికి సోమయ్య అని పేరు పెట్టి, పోలయ్య ఎంతో గారాబంగా పెంచాడు. సోమయ్య పెద్దవాడవుతున్నకొద్దీ తండ్రికి అన్ని పనులలోనూ సహకరిస్తూ వచ్చాడు.

అయితే సోమయ్యలో ఒక దురలవాటు ఉండేది. వాడు ఝాము పొద్దెక్కగాని నిద్ర లేచేవాడు కాడు; నిద్ర లేచినాక తండ్రికి అన్నం తీసుకుపోయి, పొలంలో తండ్రితో సమంగా పాటుపడేవాడు.

తన కొడుకు శ్రమపడుతున్నందుకు పోలయ్యకు సంతోషంగానే ఉండేదిగాని, పొద్దుటే లేవలేనివాణ్ణి ఎవరు పనిలో పెట్టుకుంటారు? తన తరవాత సోమయ్య గతి ఏమి కాను? ఈ భయంతో పోలయ్య తన కొడుక్కు తెల్లవారు ఝామునే నిద్ర లేచే అలవాటు కలిగించాలని చూశాడు. కాని పోలయ్య ప్రయత్నాలు ఫలించలేదు. సోమయ్యకు తండ్రి మాట మీద ఎంత విలువ ఉన్నప్పటికీ, తండ్రి చెప్పినట్టు తెల్లవారుతూనే నిద్ర లేవటం మటుకు వాడికి సాధ్యం కాలేదు.

రాను రాను ఇది పోలయ్యకు గడ్డు సమస్య అయింది. అతను ఎంత కష్టపడి పని చేసినా ఒక్క దమ్మిడీ కూడా వెనక వెయ్యలేకపోతున్నాడు. తాను బతికి ఉన్నంత కాలమూ సోమయ్యకు ఎలాగో గడిచిపోతుంది. కాని తాను పోయాక సోమయ్య తన కాళ్ళమీద తాను నిలబడాలి. వాడికి రెక్క ఆడితేగాని డొక్క ఆడదు. సోమయ్య మారకపోతే వాడి పరిస్థితి భయంకరంగా తయారవుతుంది! పోలయ్య తన ఈ భయం గురించి ఊళ్ళో ఉన్న తన బావమరిదితో చెప్పుకుని వాపోయేవాడు.

ఏ. వి. ఎస్. జగన్మోహనరావు

ఇలా ఉండగా పోలయ్య వారం రోజుల పాటు పొరుగూరు వెళ్ళవలసి వచ్చింది. సోమయ్యను తన బావమరిది ఇంట ఉంచి, వాణ్ణి జాగ్రత్తగా చూసుకో మని చెప్పి, పోలయ్య వెళ్ళిపోయాడు.

సోమయ్య తన మేనమామ ఇంటికి వెళ్ళిన మూడో రోజు ఉదయం ఆ ఇంట ఒక దొంగతనం జరిగింది. తెల్లవారుతూనే సోమయ్య మామా, అత్తా పనిలోకి వెళ్లారు. సోమయ్య ఒక్కడే ఇంట్లో ఉండగా ఈ దొంగతనం జరిగింది.

"భల్లున తెల్లవారి నువు ఇంట్లో ఉండగా నీకు తెలియకుండా ఇది ఎలా జరుగుతుంది? నువే దొంగతనం చేశావు!" అన్నాడు మేనమామ సోమయ్యతో. చుట్టుపక్కలవాళ్ళు కూడా సోమయ్య దొంగతనం చేశాడనే అభిప్రాయపడ్డారు.

తనకేమీ తెలీదనీ, తాను నిద్రపోతున్నాననీ సోమయ్య అన్నాడు. శరీర కష్టం చేసి బతికేవాడు అంత పొద్దెక్కి నిద్ర పోతున్నానంటే ఎవరూ నమ్మలేదు.

దొంగ అన్న పేరు తెచ్చుకుని సోమయ్య తండ్రి కోసం ఎదురు చూడ సాగాడు. తరవాత పోలయ్య వచ్చాడు. కొడుకు మీద దొంగతనం ఆరోపించారని విని పోలయ్యకు కోపం వచ్చి, "వాడు అలాటివాడు కాడు." అని కొడుకును ఇంటికి తీసుకుపోయాడు.

అయితే, మర్నాడు ఉదయం పోలయ్య నిద్ర లేచేసరికి, సోమయ్య కూడా లేచి ఉన్నాడు. పోలయ్య మొదట ఆశ్చర్య పడి, వెంటనే తన బావమరిది ఎత్తు గ్రహించాడు. తాను ఎంత ప్రయత్నించినా సోమయ్య నిద్ర మత్తు వదిలింది కాదు. దాన్ని తన బావమరిది వదలగొట్టేశాడు! పోలయ్య తన బావమరిదికి కృతజ్ఞత తెలుపుకున్నాడు.

"చూడు, బావా! ఈ కాస్త దానికి ఎంత తతంగం చెయ్యవలిసి వచ్చిందో! అందుకే మొక్కగా ఉండగానే వంచాలి! మానును వంచటం కష్టం!" అన్నాడు పోలయ్య బావమరిది.





# చిలుక పలుకు

ఒక ఊళ్ళో కొంచెం ఆస్తిపరురాలైన ముసలావిడ ఉండేది. ఆవిడకు ఒక మనమరాలు తప్ప మరెవరూ లేరు. ముసలావిడ ఆ మనమరాలిని ఎంతో కట్టుదిట్టంలో ఉంచి, భయభక్తులతో పెంచుతూ వచ్చింది.

అందుచేత మనమరాలికి ఇల్లు బందిఖానాలాగుండేది. ఇంట్లో అవ్వా, ఒక రామచిలుకా తప్పిస్తే ఇంకెవరూ లేరు. తన ఈడు పిల్లలు హాయిగా, స్వేచ్ఛగా తిరుగుతూ, ఆడుతూ, పాడుతూ, కేరింతాలు కొడుతూంటే మనమరాలికి ముసలిదాని మీద మంట ఎత్తుకొచ్చేది. కాని ఆమె అంటే చెడ్డ భయంకావడం చేత ఆ పిల్ల ఆవిడ ఎదట కుక్కినపేనులాగా, నోట్లో నాలుకలేని దానిలాగా, అమిత అమాయికంగా వుండేది. ముసలిది లేనప్పుడు మాత్రం ఆ పిల కసికొదీ, "ఈ ముసలిది చచ్చిపోతే బాగుండును!" అని పైకే అనేసేది.

ఈ మాటలు వినీ, వినీ చిలుకనోట పట్టాయి. ఒకనాడు అది ముసలిది వింటూండగా, "ఈ ముసలిది చచ్చిపోతే బాగుండును!" అనేసింది.

ఈ మాటలు విని ముసలమ్మ నిర్ఘాంతపోయింది. అస్తమానమూ పంజరంలోనే ఉండే చిలుకకు ఇలాటి పాపిష్ఠిమాటలు ఎలా పట్టుబడ్డాయో ఆమెకు అర్థంకాలేదు, ఎందుచేతనంటే తన మనమరాలికి నోట్లో నాలుక లేదని ఆమె నమ్మకం. తాను తప్ప వేరే దిక్కులేని ఆ పిల్ల అలాటిమాటలు ఎందుకు అంటుంది?

ఒకనాడు ఈ ముసలావిడతో పిచ్చాపాటీకి పొరుగింటి ముసలామె ఒకతె వచ్చింది. ఇద్దరూ కూర్చుని మాట్లాడుకునే

ఎ. ఫణికుమార్

సమయంలో చిలుక, "ఈ ముసలిది చచ్చిపోతే బాగుండును!" అనేసింది.

ఈ మాటలు విని, ఆ సమయంలో మాట్లాడుతున్న పొరుగింటి ముసలావిడ వెలవెలపోయి, చెబుతున్న మాట కూడా పూర్తిచెయ్యకుండా, లేచి వెళ్ళిపోయింది. ఇల్లుగల ముసలిదానికి తల తీసేసినట్టయింది.

ఎలాగైనా చిలుక చేత ఇలాటి అవాచ్యాలు పలకకుండా చేయాలని ఆమెకు తోచింది. సమీపంలో ఒక శాస్త్రుల్లుగారు ఉన్నాడు. వారి ఇంట కూడా ఒక చిలుక ఉన్నది. అందుచేత చిలుకల సంగతి ఆయనకు బాగా తెలిసి ఉండవచ్చు.

ముసలిది శాస్త్రుల్లుగారి ఇంటికి వెళ్ళి, "అయ్యా, మా చిలుక పాపిష్ఠిమాటలు నేర్చింది. ఎవరైనా ఇంటికి రా భయంగా ఉంటున్నది. దానికి కాస్త మంచి మాటలు అలవడేదారి చెబుదురూ!" అని అడిగింది.

"అదేమంత కష్టమైన పని కాదే! మా చిలుక చాలా మంచి మాటలు మాట్లాడుతుంది. దాని నోట ఎన్నడూ ఒక్క చెడ్డ మాట రాదు. కావలిస్తే, మా చిలుకను మీ చిలుక పంజరంలోనే నాలుగు రోజుల పాటు ఉంచుకోండి. దాని నుంచి మీ చిలుక కూడా నాలుగు మంచి మాటలు నేర్చుకుంటుంది," అన్నాడు శాస్త్రుల్లుగారు ముసలిదానితో.

ఆవిడ శాస్త్రుల్లుగారి చిలుకను తెచ్చి, తన చిలుకతోబాటు పంజరంలో పెట్టింది. ఈ పని చేశాక ఆవిడకు పెద్ద బరువు దించేసినట్టు అనిపించింది.

కాని అంతలోనే ఇంటి చిలుక కొత్తగా వచ్చిన చిలుకను చూసి కళ్ళు ఆర్పుతూ, "ఈ ముసలిది చచ్చిపోతే బాగుండును!" అన్నది.

వెంటనే శాస్త్రుల్లుగారి చిలుక తడుముకోకుండా, "తథాస్తు!" అన్నది.

ముసలావిడకు ఒళ్ళు మండుకొచ్చింది. ఆవిడ పంజరం తెరిచి, రెండు చిలుకలనూ వదిలిపెట్టుతూ, "పోయి చావండి!" అని తిట్టింది.



# దగాపడ్డ మనుషులు

ఒకఊళ్ళో రామనాథం, సోమనాథం అనే ఇద్దరు లక్షాధికార్లకు పెళ్ళికావలసిన కూతుళ్ళున్నారు. ఇద్దరూ తమ కుమార్తెలను పట్నంలో ఉండే సుబ్బయ్య అనే లక్షాధికారి కొడుక్కు ఇయ్యాలనుకుని, ఒకరికి తెలియకుండా ఒకరు గుర్నాథం అనే మధ్యవర్తిని నియోగించి, తిరగటానికీ ఇతర ఖర్చులకూ చెరొక అయిదువేలూ ఇచ్చుకున్నారు.

కొంత కాలంపాటు ఇద్దరికీ గుర్నాథం కనిపించలేదు. ఏమయినాడా అని విచారించగా, అతను తన కూతుర్ని పదివేల కట్నంతోబాటు సుబ్బయ్య కొడుక్కు ఇచ్చి పెళ్ళి చేస్తున్నట్టు తెలిసింది.

"ఈ మోసం ఏమిటి?" అని వాళ్ళు అడిగితే, గుర్నాథం, "నాకు మాత్రం ఏం తెలును? అమ్మాయీ, సుబ్బయ్యగారబ్బాయీ ప్రేమించుకున్నారుట. మీ రేదో ముట్టజెప్పుతారు గదా అని వారిని ఎలా విడదీయను?" అన్నాడు.

—జ్యోతి మధుసూదన్.






# మహానుగ్రహం

రంగడు అనే దొంగ తాను దొంగతనానికి పోయినప్పుడల్లా శివాలయంలో దేవుడికి మొక్కుకుని, తనపని నిర్విఘ్నంగా కొన సాగితే అది దేవుడి చలవే అనుకునే వాడు. వాడి పనికి ఎన్నడూ విఘ్నం కలగలేదు.

కాని ఒకరోజు రంగడు ఒక ధనికుడి ఇంటికి కన్నంవేస్తూ దొరికిపోయాడు. ధనికుడు వాణ్ణి తన సేవకులచేత బాగా కొట్టించి వదిలేశాడు. ఆ దెబ్బతో రంగడికి శివుడి మీద నమ్మకం చెడింది. వాడు శివాలయానికి వెళ్ళి, "ఓ మాయదేవుడా! నిన్ను నమ్మినందుకు నాకు మంచి శాస్తే జరిగింది!'' అని వెగటుగా అని, కోపంగా వచ్చేశాడు.

ఆ రోజే ఎవరో సన్యాసి తన శిష్య బృందంతో ఆ ఊరికి వచ్చాడు. ఆ చుట్టు పక్కల ప్రజలందరూ ఆ సన్యాసిని దేవుడులాగా కొలవసాగారు. రంగడికి ఆ సన్యాసి మీద గురికుదిరింది. అందు చేత వాడు దొంగతనానికి పోయేటప్పుడు శివాలయానికి వెళ్ళటం మానేసి, సన్యాసి వద్దకు వెళ్ళి, నమస్కారం చేసి, "స్వామీ, నేను పోయేపని విజయవంతం చెయ్యి,'' అనేవాడు.

"అలాగే! పో, భక్తా!'' అనేవాడు సన్యాసి.

ఒకరోజు రాత్రి ఆ సన్యాసి పక్క ఊరిలో ఒక షావుకారు గారింట పూజ నిర్వహిస్తున్నాడని రంగడికి తెలిసింది. సన్యాసి తన శిష్యగణంతో పక్క ఊరికి బయలుదేరకమునుపే రంగడు వెళ్ళి, ఆయనకు మొక్కి, ఆశీర్వాదం పొందాడు.

రంగడు ఆ రాత్రి సన్యాసి పూజ నిర్వహించే షావుకారు ఇంటికే దొంగతనానికి

---

రావల రామకృష్ణారెడ్డి

పోవాలని నిశ్చయించాడు. వాడు పొద్దు పోయి షావుకారు ఇంట ప్రవేశించే సరికి, అందరూ పడుకుని నిద్రపోతున్నారు. సన్యాసి శిష్యులు దేవుడి గదికి ఎదురుగా పడుకుని ఉన్నారు. గది తలుపులు తెరిచే ఉన్నాయి.

రంగడు తిన్నగా దేవుడి గది ప్రవేశించాడు. అంతలో సన్యాసి ఒక మూటతో వాడికి ఎదురై, "భక్తా, భయపడకు. నువు ఈ రోజు ఇక్కడికి వస్తావని నాకు తెలుసు. నేను దివ్యదృష్టితో చూశాను. ఇవి దేవుడికి అలంకరించిన బంగారు నగలు. వీటిని తీసుకుని తొందరగా వెళ్ళిపో" అన్నాడు.

రంగడి సంతోషానికి హద్దులేదు. వాడు సన్యాసి ఇచ్చిన మూట తీసుకుని, ఆయన కాళ్ళపైన పడి, "స్వామీ, మీరే నిజమైన దేవుడు!" అని వచ్చేశాడు.

వస్తూ, వస్తూ, వాడు శివాలయం దగ్గిర ఆగి, "చూడు, నా దేవుడు నన్ను రక్షించి సహాయం చేశాడు. నువూ ఉన్నావు–ఎందుకు?" అని వెటకారంగా అని, ఇంటికి వచ్చాడు.

మర్నాడు రాత్రి సన్యాసి తన శిష్యులతో సహా వచ్చి, రంగడి ఇంటి మీదపడి, నగలు కాస్తా దోచుకుపోయాడు.

తెల్లవారగానే, పొరుగూరి షావుకారు మనుషులు ఇద్దరు వచ్చి, తమ షావుకారు తీసుకు రమ్మన్నాడని, రంగణ్ణి పట్టుకుపోయారు. రంగడి ప్రాణాలు పిచపిచలాడాయి. వాడు దారిలో రాతి దేవుడికి మనసులో దణ్ణం పెట్టుకుని, "స్వామీ, ఈ ఒక్కసారి నన్ను కాచావంటే, నేనీ వృత్తి మానుకుంటా," అనుకున్నాడు.

రంగడు షావుకారు ఇంటికి చేరే లోపల, సన్యాసి తన నగలతో రాజభటులకు దొరికినట్టు షావుకారుకు వర్తమానం అందింది. రంగడు తప్పించుకున్నాడు.

తిరుగుదారిలో వాడు శివాలయం దగ్గిర ఆగి, "నన్ను రక్షించావు, దేవా!" అని మరీ మరీ దణ్ణాలు పెట్టుకున్నాడు.





# పక్షపాతం

పూర్వం విజయపురాన్ని పాలించిన అమరసింహుడికి ఇద్దరు కొడుకులు. పెద్దవాడు వీరసింహుడూ, చిన్నవాడు శూరసింహుడూనూ. అమరసింహుడు మరణించినాక వీరసింహుడు రాజయాడు. శూరసింహుడు అన్న మీద ఎంతో భక్తి విశ్వాసాలు కలిగి, రాజ్యపాలనలో కుడిభుజంగా ఉంటూవచ్చాడు.

ఇలా ఉండగా సేనాధిపతి ఆకస్మికంగా మరణించాడు. ఆ పదవిలో తన తమ్ముణ్ణి నియమించాలని వీరసింహుడు అనుకుని, తన అభిప్రాయం మంత్రితో చెప్పాడు.

"సేనాధిపతి నియామకం గురించి మన దేశంలో అనాదిగా ఒక ఆచారం ఉన్నది. యుద్ధవిద్యలలో పోటీలుపెట్టి, వాటిలో నెగ్గినవాణ్ణే సేనాధిపతిగా నియమించాలి. దాన్ని ఉల్లంఘించటానికి లేదు," అన్నాడు మంత్రి.

వీరసింహుడి గుండెల్లో రాయి పడింది. యుద్ధ విద్యలలో పోటీలు జరిపితే, అందులో శూరసింహుడు తప్పక గెలుస్తాడన్న నమ్మకం వీరసింహుడికి లేదు. శూరసింహుడు యుద్ధ విద్యలలో ప్రావీణ్యం గలవాడే, కాని అతన్ని మించినవాళ్లు దేశంలో ఉండరని ఎలా నమ్మటం? ఆచారానికి భంగంకలగకుండా తన తమ్ముణ్ణి సేనాధిపతి చెయ్యటం ఎలాగో వీరసింహుడికి తెలియలేదు.

"ప్రభూ, ఇది చాలా స్వల్పవిషయం. పోటీలు జరపండి. శూరసింహుడు వాటిలో తప్పక గెలుస్తాడు," అని మంత్రి అన్నాడు.

చేసేదిలేక, వీరసింహుడు పోటీలు జరపటానికి అంగీకరించాడు. సేనాధిపతి పదవికి యుద్ధవిద్యలలో పోటీలు జరుగుతాయనీ, యువకులు ఎవరైనా పాల్గొనవచ్చుననీ దండోరా వేశారు.

గంగిశెట్టి శివకుమార్

విజయపురంలో సుధన్వుడు అనే యువకుడు యుద్ధ విద్యలన్నిటా ఆరితేరినవాడు. అతను పోటీలో పాల్గొంటున్నాడని తెలిసి, అతని మీద ఓడిపోయినవారు అనేకమంది పోటీలో పాల్గొనలేదు. సుధన్వుడు మిగిలిన పోటీదార్లందరినీ ఓడించి, శూరసింహుడితో పోటీకి నిలబడ్డాడు.

మొదటి రోజు ఇద్దరికీ మల్లయుద్ధం జరిగింది. అందులో ఎవరు గెలిచినదీ నిర్ణయించటం ఎవరికీ సాధ్యం కాలేదు.

రెండో రోజు విలువిద్యా ప్రదర్శనం జరిగింది. అందులో సుధన్వుడు శూరసింహుణ్ణి అవలీలగా మించాడు. అది చూసి వీరసింహుడు కుంగిపోయాడు. కాని మంత్రి అతనికి ధైర్యం చెబుతూ, "ప్రభూ, మీరేమీ అధైర్యపడకండి. రేపటి పోటీలో విజయం తప్పక శూరసింహుడిదే!" అన్నాడు నమ్మకంగా.

చివరిరోజు కత్తియుద్ధంలో పోటీ జరిగింది. యుద్ధం మంచి పట్టులో ఉండగా సుధన్వుడి కత్తి కాస్తా విరిగిపోయింది. శూరసింహుడు గెలిచాడు. తనకు అన్యాయం జరిగిందని సుధన్వుడు గ్రహించాడు.

న్యాయబుద్ధి గల వీరసింహుడు తనకు జరిగిన అన్యాయాన్ని సరిచేస్తాడన్న నమ్మకంతో సుధన్వుడు అతని కేసి చూశాడు. కాని వీరసింహుడు తన తమ్ముడు నెగ్గాడనీ, అతనికే సేనాధిపతి పదవి ఇయ్యొవచ్చుననీ ఆనందంలో మైమరచి ఉన్నాడు.

మంత్రి అయినా తనకు అన్యాయం జరిగినట్టు గుర్తిస్తాడేమోనని సుధన్వుడు మంత్రి కేసి చూశాడు. మంత్రి తత్తరపడి తన చూపులు మరల్చుకున్నాడు.

ఇక తనకు ప్రజలే న్యాయంచేకూర్చుతారన్న ఆశతో సుధన్వుడు ప్రేక్షకుల కేసి చూశాడు. తమ రాజుగారి తమ్ముడి విజయాన్ని తమ విజయంగానే భావించి, జయజయధ్వానాలు చేస్తున్నారు ప్రజలు. సుధన్వుడికి న్యాయమే జరిగిందో, అన్యాయమే జరిగిందో వాళ్ళకు పట్టలేదు.

సుధన్వుడు పరిస్థితి అర్థంచేసుకుని ఇంటి ముఖం పట్టాడు.





# వీర హనుమాన్

హనుమంతుడు శరవేగంతో పోయి, చంద్రసేన వున్న రాణివాస భవనాన్ని చేరుకున్నాడు. ఆ భవనం పచ్చ రాతితో, అద్భుతమైన శిల్పంతో నిర్మించబడి వున్నది. అంత చీకటిలో కూడా భవనం పచ్చని కాంతులు విరజిమ్ముతున్నది; అక్కడక్కడ తాపిన కెంపులు ఎర్రని వెల్తురును ప్రసరిస్తున్నవి.

భవన ద్వారం వద్ద రాక్షసులెవరూ కాపలా లేరు. అందరూ కాళికాలయం దగ్గిర జరిగే మహోత్సవంలో పాల్గొనేందుకు వెళ్ళిపోయారు. కాని, ద్వారం ముందు ఎర్రగా మెరుస్తున్న కనుగుడ్లను తిప్పుతూ, కాళ్ళు గల ఒక భయంకర రక్కసిసర్పం తిరుగుతున్నది.

హనుమంతుడు, రక్కసి సర్పాన్ని, సర్పం హనుమంతుణ్ణీ ఒకేసారి చూడటం జరిగింది. వెంటనే సర్పం బుసలు కొడుతూ ఉవ్వెత్తున లేచింది. దాని ముక్కుపుటాల నుంచి పొగలూ, జ్వాలలూ వెలువడసాగినై. హనుమంతుణ్ణి మింగేందుకు అది నోరు తెరిచి ముందుకు రాసాగింది. హనుమంతుడు, ఆ రక్కసి సర్పాన్ని చంపేందుకు లంఘించబోయేంతలో, భవనం పై భాగంనుంచి కోమలమైన స్త్రీ కంఠం చేసిన ఆర్తనాదం వినిపించింది.

హనుమంతుడు మరుక్షణం సూక్ష్మ రూపం ధరించి, రక్కసి సర్పం నోటిగుండా లోపల ప్రవేశించి, దాని పొట



చీల్చి చంపి, భవనంలోకి పరిగెత్తాడు. భవనం అంతా చీకటిమయంగా వున్నది. అక్కడక్కడ మాత్రం ఎర్రని కెంపులు చిన్నగా మెరుస్తున్నాయి. హనుమంతుడు స్త్రీ ఆర్తనాదం వచ్చిన ప్రదేశం కోసం దిక్కులు చూసేంతలో, పై అంతస్తు నుంచి కొరడా ఛెళుకులూ, ఆర్తస్వరమూ మరొకసారి వినిపించాయి.

హనుమంతుడు చప్పున కదిలి చంద్రసేన బంధింపబడి వున్న గది దగ్గరకు పోయాడు. గది తలుపులు లోపల గడి పెట్టబడి వున్నాయి. హనుమంతుడు ఎత్తుగా వున్న కిటికీగుండా లోపలికి చూశాడు. అప్పుడే మూర్ఛనుంచి తేరుకున్న చంద్రసేనను కంటకి కొరడాతో కొడుతూ, ''ముదనష్టపుదానా! బుద్ధిమాలి మైరావణుడు, మా పాతాళ లంకకు చీడపురుగును తెచ్చినట్టు నిన్ను తెచ్చిపెట్టాడు. కాళికాలయంలోకి ఎవడిని పంపావో చెప్పు? ఇప్పుడే గొడ్డలితో నీ తల నరికివేస్తా. ఉహుఁ, కాదు, గొంతు పిసికి చంపటమే నీకు తగిన శిక్ష!'' అంటూ చంద్రసేన గొంతు పట్టుకున్నది.

హనుమంతుడు వెంటనే తన వాలాన్ని పెంచి కిటికీలోకుండా లోపలికి పంపాడు. కంటకి చంద్రసేన గొంతు నులుముతున్నంతలో, హమమంతుడి తోక ఆ రాక్షసి మెడను చుట్టి, గట్టిగా బిగించి, యివతలికి గుంజింది. కంటకి చాపచుట్టలా నేలమీద పడి, ప్రాణాలు వదిలింది.

హనుమంతుడు గది తలుపులు విరగదన్ని లోపలప్రవేశించి, చంద్రసేనకు నమస్కరించాడు. తరవాత కొద్ది మాటల్లో పరిస్థితి అంతా ఆమెకు చెప్పి, మైరావణుణ్ణి చంపే మార్గం తెలియపరచమన్నాడు.

రాముడి పేరు వింటూనే చంద్రసేన తాను కంటకి వల్ల పడిన హింస అంతా మరిచి, సేదదేరి, ''హనుమంతుడా! నీకు మైరావణుడి ప్రాణ రహస్యం చెబుతాను. కాని, ముందుగా నువ్వు, ఒక వాగ్దానం చేయాలి. మైరావణ

సంహారం జరిగాక, నీ యజమానిని నా దగ్గిరకు తీసుకురావాలి,'' అన్నది.

హనుమంతుడు అలాగే రాముణ్ణి తీసుకువస్తానని వాగ్దానం చేశాడు. చంద్రసేన అతడికి మైరావణుడి ప్రాణాలు భద్రపరిచి వున్న చోటు గురించి చెప్పింది. వెంటనే హనుమంతుడు గది బయిటికి వచ్చి, ఆకాశంలోకి ఎగిరి, సప్త సముద్ర మధ్యంలో వున్న జ్వాలాముఖి పద్మాన్ని చేరుకున్నాడు. భగభగ మండే జ్వాలలే ఆ పద్మానికి రేకులుగా వున్నవి. హనుమంతుడు అగ్నిదేవుణ్ణి స్మరించి, పద్మంలో ప్రవేశించి, దాని కాడగుండా జారి, మకరబిలాన్ని చేరాడు.

మకరబిలంలో భయంకరమైన సర్పాలు బుసలు కొడుతున్నవి; పిశాచ గణాలు హుంకరిస్తున్నవి. హనుమంతుడు పెద్దగా సింహనాదం చేసి, ఆ దుష్ట శక్తులను ఎడాపెడా పిడికిళ్లతో కుమ్ముతూ, కరాళ గుహలోకి పోయాడు. అతడి ధాటి చూసిన భూతశక్తులన్నీ పారిపోయాయి గాని, గుహ ఎత్తున వున్న ఒకే ఒక్క నల్లని భయంకరాకారం, తెల్లని కోరలతో, ఎర్రని కళ్ళతో అతడి దారికి అడ్డంగా నిలబడి వికటాట్టహాసం చేసింది.

'' ఎవడవురా నీవు? అడ్డం తొలుగు!'' అన్నాడు హనుమంతుడు తీవ్రస్వరంతో.



ఆ మాటలకు భయంకరాకారం వికవిక నవ్వి, '' నేను బేతాళుడను; భూత, ప్రేత, పిశాచాలకు నాయకుడను! నువ్వెవడివి? ఇక్కడికి రాగలవారు యిద్దరే. ఒకడు మైరావణుడు-నువ్వు మైరావణుడివి కావు! ఇకపోతే, నీవు ఆ రెండో మహాశక్తిమంతుడవే అయి వుండాలి,'' అన్నది.

హనుమంతుడు బిగ్గరగా నవ్వి, '' ఔరా, బేతాళా! శ్మశానాల్లో స్వేచ్ఛగా విహరించే నీకు, ఈ చీకటి గుహలో వుండే దురవస్థ ఎందుక్కలిగింది? ఛీ, అడ్డం తొలగు! లేకపోతే నా శక్తి ఎలాంటిదో చూపవలసివస్తుంది,'' అన్నాడు.



బేతాళుడు హేళనగా నవ్వి, ''ఏదీ, ఆ శక్తి ఏపాటిదో చూస్తాను!'' అన్నాడు.

హనుమంతుడు చప్పున పిడికిలితో బేతాళుణ్ణి పొడిచాడు. ఆ దెబ్బకు బేతాళుడు నేలకొరిగి, హనుమంతుడికి నమస్కరిస్తూ, ''స్వామీ హనుమా! ధన్యుణ్ణి. చిన్న అపచారం చేసి, ఈ గుహలో పడి వుండేట్టుగా శాపం పొందాను. నీ స్పర్శతో నాకు శాపవిముక్తి కలుగుతుందని శివుడు చెప్పాడు. జై, వీర హనుమా!'' అంటూ మాయమయ్యాడు.

హనుమంతుడు గుహ మధ్యకు పోయాడు. అక్కడ ఉన్నతమైన ఒక శిలావేదిక మీద గుండ్రటి రత్నపేటిక వున్నది. దాని మూత మీద అగ్ని శిఖ జ్వలిస్తున్నది. అతడు పేటికను సమీపించేసరికి, ప్రచండమైన జ్వాలలు చెలరేగి, అతడి శరీరం కందిపోయేట్లుగా చుట్టుముట్టాయి. వెంటనే హనుమంతుడు గట్టిగా గాలిపీల్చి, మంటల మీదికి ప్రళయమారుతంలాగా ఊదాడు. కాని, మంటలు చల్లారకపోగా, అవి అతణ్ణి మరింత తీవ్రంగా చుట్టుముట్టాయి.

హనుమంతుడు చేతులెత్తి, ''అగ్ని దేవా! నేను నీ మిత్రుడైన వాయువు కుమారుణ్ణి. అనుగ్రహించు!'' అంటూ అగ్నిని ధ్యానించాడు. వెంటనే అగ్ని జ్వాలలన్నీ చల్లారిపోయాయి.

ఆ వెంటనే రత్నపేటిక మీది జ్యోతి నుంచి యిలా మాటలు వినిపించాయి:

''మారుతీ! నీకు ఒక ముఖ్య విషయం చెప్పేందుకే, నేనిలా విజృంభించాను. నీవు యీ పేటికలోని తుమ్మెదలను ఒక్కసారిగా సంహరించాలంటే, ఐదు ముఖాలు తెచ్చుకుని, వాటిని నీ నోళ్ళతో లోపలికి పీలుస్తూ, నమిలివెయ్యాలి. బాగా గుర్తుంచుకో!''

హనుమంతుడు అగ్నికి నమస్కరించి, తుమ్మెదలున్న రత్నపేటికను తీసుకుని వాయువేగంతో రామలక్ష్మణులున్న చోటుకు వచ్చాడు. వాళ్ళిద్దరూ యింకా



అసంఖ్యాకులైన మైరావణులతో పోరాడుతూనే వున్నారు హనుమంతుడు పెద్దగా సింహనాదం చేస్తూ, మైరావణుడి ఎదురుగా వాలి, నిలబడి, రత్నపేటికను ఎత్తి పట్టుకుని, "ఒరే, పాతాళ లంకేశ్వరా! నీ పంచ ప్రాణాలున్న పేటికను తెచ్చాను. ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకుని, రామలక్ష్మణులను శరణు వేడుకో!" అన్నాడు.

తన పంచప్రాణాలు గల రత్నపేటికను చూసి మైరావణుడు కలవరపడ్డాడు. శరీరం బండరాళ్ళ మధ్య నలిగిపోతున్నట్టు బాధపడుతూ, "ఎంతపని చేశావురా వానరా! పేటికలో వున్నవి నా ప్రాణాలే కాని. అవి రామలక్ష్మణుల పాలిటా, నీ పాలిటా మృత్యువనుకో. ఆ పేటికను తెరిచావో, అవి నిన్ను కుట్టి, నీ శరీరాన్ని కాలకూట విషంతో నింపి, నిన్ను నిలువునా దగ్ధం చేస్తాయి. మీ ముగ్గురి మృత్యువునూ యిక్కడికి మోసుకొచ్చావు. ప్రాణాలమీద ఆశ వుంటే, ఆ పేటికను కిందపెట్టు," అన్నాడు.

హనుమంతుడు ఆ మాటలకు పెద్దగా నవ్వి, "నిద్రలో వున్న రామలక్ష్మణులను మాయతో యిక్కడికి తెచ్చినందుకు, నీకు చావు తప్పదు. చచ్చేముందు మరేవైనా తెలిసిన మాయ మంత్రాలుంటే ప్రదర్శించు," అన్నాడు.

హనుమంతుడి నిర్భయత్వం చూసి, మైరావణుడు బెంబేలు పడిపోతూ, "కంటకీ! కంటకీ! వెంటనే చంద్రసేనను చంపు!" అని బిగ్గరగా అరిచాడు.

హనుమంతుడు మందహాసం చేసి, "ఓరి మాయల మైరావణా! ఆ కంటకి నీ కన్న మరికాస్త ముందు చూపున్న దుర్మార్గురాలు. అది యింతకుముందే చంద్రసేనను చంపే ప్రయత్నం చేసింది. కాని, ఆ సమయంలోనే దాని ఆయువు తీరిపోయింది," అన్నాడు.

మైరావణుడికి జరిగినదంతా అర్థమైపోయింది. అతడు బిగ్గరగా ఒక కేకపెట్టి,

అందుబాటులో వున్న ప్రతి ఆయుధాన్నీ బాణంలా ప్రయోగిస్తూ, రామలక్ష్మణుల మీదికి వెళ్ళాడు. అతడు మధ్య మధ్య తన శరీరాన్ని తానే గాయపరుచుకుని రక్తం చిందించుతూంటే, మైరావణులు తండోపతండాలుగా పుట్టుకొచ్చి, రామలక్ష్మణులను చుట్టుముట్టారు. అది చూసి హనుమంతుడు శివుణ్ణి స్మరించి, ఐదు ముఖాలు తెచ్చుకుని, పంచముఖాంజనేయుడుగా అవతరించాడు.




హనుమంతుడు ఐదు ముఖాలతోనూ ఒకేసారి ప్రళయహుంకారం చేసి, రత్నపేటిక మూత తీయగానే, ఉరుములురిమి పిడుగులు పడినట్లుగా, ఎర్రని మెరుపులతో ప్రళయఝుంకారం చేస్తూ వెలువడిన ఐదు తుమ్మెదలు, అతణ్ణి కాటువేసేందుకు మీదికి వెళ్ళాయి. హనుమంతుడు ఒక్కొక్క ముఖంతో గట్టిగా లోపలికి గాలి పీలుస్తూ, ఒక్కొక్క తుమ్మెదనూ నోటపట్టి, కసిగా ఏకకాలంలో వాటిని గట్టిగా నమిలి చంపి, నేలమీద ఊశాడు. మరుక్షణం మాయ మైరావణ మూక అంతా నేలకూలి ప్రాణాలు వదిలారు.

ఈ విధంగా తన బలగమంతా నశించినా, మైరావణుడు పారిపోయే ప్రయత్నం చేయక రామలక్ష్మణుల మీద రకరకాల ఆయుధాలూ, బాణాలూ ప్రయోగించసాగాడు. అప్పుడు రాముడు ఒక మహాస్త్రంతో మైరావణుడి తల తెగి నేల మీద పడేలా కొట్టి, అతణ్ణి చంపాడు.

పంచముఖాంజనేయ, రామలక్ష్మణులపై పూలజల్లు కురిసింది. బ్రహ్మాది దేవతలూ, శివుడూ అక్కడికొచ్చారు. బ్రహ్మ రాముడితో, "ఓయీ రామా! ఈ మైరావణుడు కాలనేమి అంశతో జన్మించినవాడు. హనుమంతుడి సాయంవల్ల, నీ చేతిలో అతడు చావటం జరిగింది. హనుమంతుడు, శివుని అంశతో జన్మించినవాడు గనకనే, మైరావణ సంహారానికి అవసరం అయిన, ఆ రత్న

పేటికను సప్త సముద్రాల మధ్యనుంచి తేగలిగాడు,'' అని చెప్పాడు.

శివుడు హనుమంతుణ్ణి ఆశీర్వదించి, ''హనుమంతుడా, నీ శక్తియుక్తులూ, బల పరాక్రమాలూ అపారమైనవి. మైరావణ సంహారం మాటలు కాదు! ఎంతో దుర్ఘటమైన ఆ కార్యాన్ని విజయవంతంగా నెరవేర్చావు. పంచముఖాంజనేయ రూపాన్ని స్మరించినవారికి, భూత పిశాచాదుల నుంచి ఎటువంటి హానీ కలగదు,'' అన్నాడు.

హనుమంతుడు తన పంచముఖ స్వరూపాన్ని ఉపసంహరించుకుని, బ్రహ్మకూ, శివుడికీ ప్రణామాలు చేశాడు. బ్రహ్మ, శివుడూ వారి వెంటవచ్చిన దేవతలూ, రామలక్ష్మణులకు విజయం కలగాలని ఆశీర్వదించి, వెళ్ళిపోయారు.

బ్రహ్మ వెళ్ళిపోయే ముందు రాముడికి, పాతాళలంకా రాజ్యానికి మత్స్యవల్లభుణ్ణి అధిపతిగా చేయమని ఆదేశం యిచ్చాడు. దానిప్రకారం రాముడు, మత్స్యవల్లభుడిని పిలిపించి, అతణ్ణి పాతాళలంక పాలకుడుగా అభిషేకించి, పట్టాభిషిక్తుణ్ణి చేశాడు.

ఇవన్నీ పూర్తి అయింతరవాత హనుమంతుడు ఎంతో వినయంగా రాముడికి, తాను చంద్రసేనకుచేసిన వాగ్దానంగురించి చెప్పి, ''రామా, ఆ చంద్రసేన సహాయం లేకపోయినట్టయితే, నేను మైరావణుడి ప్రాణాలున్న ప్రదేశం కనుక్కోవటం సాధ్యమయేది కాదు. కార్యసాధన కోసం, మైరావణుడి సంహారం తరవాత నిన్ను, ఆమె దగ్గిరకు తీసుకువస్తానని వాగ్దానం చేశాను,'' అన్నాడు.

రాముడు కొంచెంసేపు మౌనంగా ఆలోచించి, తల పంకిస్తూ, ''అలాగా! సరే పద,'' అన్నాడు.

రాముడు యిలా అనగానే హనుమంతుడు ఎంతో సంతోషపడి, చంద్రసేన వున్న మందిరానికి ముందుండి దారి తీశాడు. రాముడు చిరునవ్వు నవ్వుతూ అతణ్ణి అనుసరించాడు.





# రాజకుమారి తారాబాయి

తన వయసుకు మించిన సాహసం, శక్తియుక్తులూ ప్రదర్శించి, తారాబాయి అనే రాజకుమారి, తన తండ్రి పాలించే రాజ్యాన్ని ఆక్రమించిన విదేశపాలకుణ్ణి హతమార్చిన సంఘటనయిది.

థోడా అనే రాజ్యానికి రావు సుర్తాన్ ప్రభువు. ఆ రాజ్యాన్ని లిల్లా అనే ఆఫ్ఘన్ జాతీయుడు ఆక్రమించి, అతి క్రూరంగా పాలించసాగాడు. రావ్ సుర్తాన్ ఆరావళీపర్వత ప్రాంతాలకు పారిపోయాడు. ఆయన కుమార్తె తారాబాయి. ఆమె బాల్యం నుంచి తండ్రి ద్వారా తమ పూర్వుల శౌర్య సాహస కార్యాలను గురించి వింటూండేది.





థోడా రాజ్యాన్ని లిల్లా క్రూరపరిపాలన నుంచి విముక్తి చేసేందుకు రావ్ సుర్తాన్ చాలా ప్రయత్నాలు చేశాడు. కాని, ఆఫ్ఘన్ లిల్లా సైనికబలం ముందు అవన్నీ విఫలమయ్యాయి.



తన ప్రజలు పరాయి పాలనలో పడుతున్న బాధలు చూసి రావు సుర్తాన్ గుండె తరుక్కుపోతూండేది. తారాబాయి తన తండ్రి విచారం చూసి బాధపడేది. ఎలాగైనా తమ రాజ్యాన్ని తిరిగి జయించాలనే పట్టుదల ఆమెలో వృద్ధికాసాగింది. పదహారేళ్ళ వయసు వచ్చేసరికి తారాబాయి అన్ని యుద్ధ విద్యల్లోనూ ప్రవీణురాలైంది. గుర్రం మీద వేగంగా స్వారిచేస్తూనే, ఆమె బాణంతో లక్ష్యాన్ని కొట్టగలిగేది.



తారాబాయి చెలికత్తెలకు రాజకుమారి యిలాంటి పురుషోచిత విద్యలు నేర్వటం ఏ మాత్రం యిష్టంలేదు. "యువకుడిలాగా యిలా కత్తిసామూ, విలువిద్యల్లో కాలం గడిపే నిన్ను, ఎవరు వివాహం ఆడతారు?" అని వాళ్ళు, తారాబాయిని ప్రశ్నించేవాళ్ళు. దాని కామె, "వీరాధివీరుడైనవాడే నన్ను వివాహమాడేందుకు అర్హుడు!" అని తొణకకుండా జవాబిచ్చేది.



తారాబాయి యుద్ధవిద్యా నైపుణ్యురాలే కాక, గొప్ప సౌందర్యవతి. ఆమెను గురించి విన్న కొందరు రాజపుత్ర యువకులు, ఆమెను వివాహమాడేందుకు ప్రయత్నించారు. కాని, తారాబాయి తన తండ్రితో, "మన థోడా రాజ్యాన్ని శత్రువుల నుంచి విముక్తి చేయగల యువకుణ్ణి మాత్రమే, నేను వివాహం చేసుకుంటాను," అని ఖచ్చితంగా చెప్పేసింది.

బలవంతుడూ, క్రూరుడూ అయిన ఆఫ్ఘన్ లిల్లాతో .యుద్ధమంటే మాటలు కాదు. ఆ సంగతి ఎరిగిన క్షత్రియ యువకులు చాలామంది వివాహ ప్రయత్నం మానుకున్నారు. మేవార్ రాజకుమారుడైన పృథ్వీరాజు నిర్భయస్థుడు, శౌర్యవంతుడు. అతడు రావ్ సుర్తాన్ దగ్గిరకు వచ్చి, తాను ఆఫ్ఘన్ లిల్లాపై దాడి చేసేందుకు సిద్ధంగా వున్నానని చెప్పాడు.





తారాబాయి, పృథ్వీరాజు ధైర్య సాహసాలను గురించి విని వున్నది. ఆమె లిల్లా మీద జరిగే దాడిలో తాను కూడా పాల్గొని తీరాలని పట్టుపట్టింది. పృథ్వీరాజు సరేనన్నాడు. ఐదువందల మంది మెరికల్లాంటి సైనికులను వెంటబెట్టుకుని, ఇద్దరూ థోడా పట్టణం కేసి బయులుదేరారు.



ఆ సమయంలో థోడా పట్టణంలో గొప్ప ఉత్సవం ఒకటి జరుగుతున్నది. లిల్లా తన కోటలోని భవనం మిద్దె మీద కూర్చుని, కింద కవాతు చేస్తూ పోతున్న తన సైనికులను చూసి తృప్తిగా తలాడిస్తున్నాడు.



వెంటవున్న సైనికుల్ని కోట బయట వుంచి, తారాబాయి, పృథ్వీరాజులు లిల్లాను సమీపించారు. లిల్లా భవనం మీది నుంచి వాళ్ళను చూసి, "గుర్రాల మీద వున్న యీ కొత్త వాళ్ళెవరు?" అని కేకపెట్టాడు. అంతలో తారాబాయి వదిలిన బాణం, పృథ్వీరాజు విసిరిన బల్లెం లిల్లాను తాకినై. వాడు మరుక్షణం ప్రాణాలు వదిలాడు. తారాబాయి, పృథ్వీరాజులు కోట ద్వారం కేసి తమ గుర్రాలను పరిగెత్తించారు.

లిల్లా సైనికులు జరిగిందేమిటో తెలుసుకుని, వాళ్లను అటకాయించమని ద్వారం దగ్గిర కాపలా వున్న వాణ్ణి హెచ్చరించారు. వాడు, వాళ్ళిద్దరి దారికి అడ్డంగా ఏనుగును తోలాడు. ముందు గుర్రం మీద వున్న తారాబాయి కత్తితో ఏనుగు తొండం తెగ నరికింది. అది పారిపోయింది. ఇద్దరూ కోట బయిటికిపోయి, తమ సైనికులను కలుసుకున్నారు.





ఆఫ్ఘన్ సైనికులు వాళ్ళను వెంబడించారు. తారాబాయి తన వెంట వున్న ఐదువందల మంది సైనికులతో, శత్రువులను ఎదిరించింది. అప్పుడు జరిగిన భయంకర యుద్ధంలో ఆఫ్ఘన్‌లు చిత్తుగా ఓడిపోయారు. రావు సుర్తాన్ తిరిగి థోడా రాజయాడు. తారాబాయి, పృథ్వీరాజుల వివాహం వైభవంగా జరిగింది.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 [illegible] గెలవండి!

?

ఒకసారి కొందరు సముద్రవర్తకులు సముద్రమధ్యంలో ఒక దీవిని చూశారు. యాభై ఏళ్ళుగా అటుగా ఓడలు నడుపుతున్న నావికులు కూడా ఆ ప్రాంతంలో ఆ దీవిని చూడలేదు.

నౌక యజమాని ఆ దీవి ఒడ్డున లంగరు దించాడు. వర్తకులు దీవి మీదికి వెళ్ళితే అక్కడ ఒక నగరం ఉన్నది. మనుషులున్నారు. వాళ్ళు రకరకాల జీవనం గడుపుతున్నారు.

అయితే వర్తకులను ఎవరూ గమనించలేదు. వర్తకులు పలకరిస్తే ఎవరూ వినలేదు. వర్తకులు ఆ మనుషులను తాకనైనా లేకపోయారు. ఇదిచూసి ఆశ్చర్యపడుతూ వర్తకులు రాజభవనానికి వెళ్ళారు. రాజు దర్బారు తీరి ఉన్నాడు.

నౌక యజమాని తనను ఎవరూ గుర్తించలేరని తెలుసుగనక, తిన్నగా రాజు వద్దకు పోయి, అతని ముఖంలో ముఖం పెట్టి, రాజు కళ్ళలోకి చూశాడు. వెంటనే రాజు విరుచుకు పడిపోయాడు.

ఆస్థానమాంత్రికుడు వచ్చి రాజును పరీక్షించి, "బతికున్నవాళ్ళ గాలిసోకింది రాజుకు. వాళ్ళను మారణహోమం చేస్తాను," అన్నాడు.

ఈ మాట వింటూనే వర్తకులు పరిగెత్తిపోయి తమ ఓడ ఎక్కి, లంగరు ఎత్తి తమ దారిన తాము పోయారు. వాళ్ళు వెనక్కు తిరిగి చూస్తే దీవి లేదు.

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2 & 3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలించబడవు.

కార్డులు మాకు మే 20 లోగా చేరాలి. అందులో ఫొటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, '77 జూలై చందమామలో ప్రకటించబడతవి.

---

మార్చి నెల పోటీ ఫలితం: సూది బెజ్జం చూచి, జల్లెడ వెక్కిరించినట్లు.

గెలుపొందినవారి పేరు: బి. విజయ, 1-384, తార్నాక, హైదరాబాద్—17

## ఫోటో వ్యాఖ్యల పోటీ : . బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1977 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.



D. A. Narasimha Raju





D. Jagdish Chandra

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒకట్రెండు మాటలలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ మే నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వృద్ధాప్యం జాడలు—

రెండవ ఫోటో : వృక్షంలో కనిపిస్తున్నవి.

పంపినవారు : వి. కె. విశ్వనాథరెడ్డి, 15 వ. వార్డ్, భీమవరం.

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras 600 026 : Controlling Editor : NAGI REDDI

## ఇంగ్లీషులో మాట్లాడాలనుకొంటున్నారా?

# ఆంగ్లభాషా సంభాషణ బోధిని

**వెల రు. 12-00**

ఈ పుస్తకమును మంచి ఉచ్చరింపుతో అర్థంచేసుకుంటూ 6 సార్లు బాగుగా చదివిన ఎడల ఇతరులు, ఎదుటివారు ఇంగ్లీషులో మాట్లాడునప్పుడు వారితో ఇంగ్లీషులో మాట్లాడుటకు, అర్థం చేసుకొని జవాబులు చెప్పవచ్చును.

తపాలా ఖర్చు రు. 3-00 అధికముగా పంపుతూ పుస్తకము కొరకు వ్రాయవలయును./ఎ. పి. ఒ. లో యుంటున్నవారు పూర్తి వెల ముందుగా పంపవలయును.

గీతారామ్ (C. M)
నెం. 16, రాజేంద్రన్ కాలనీ, అరుణాచలం రోడ్డు,
సాలిగ్రామం, మద్రాసు-600 093

---

# ఇదుగో వచ్చింది స్కాలర్!



## బ్లాక్ బర్డ్ వారి నుంచి విద్యార్థులకు అతి చక్కని పెన్ను

ఇప్పుడు బ్లాక్ బర్డ్ వారు
ప్రత్యేకంగా విద్యార్థుల కోసం
'స్కాలర్'ను సృష్టించారు—
తేలికై సుందరమైన ఆకారంతో
చక్కగా చేతికి అమిరేందుకు
...పట్టులాగా సాఫీగా జాలువారే
సిరాకోసం అతి సన్నని
ఇరిడియం కొనగల పాళీతో.
దానిని చూడండి. పరీక్షించండి.
పూర్తి మార్కులు పొందగల
అర్హత ఈ పెన్నుదేనని
మీరు అంగీకరిస్తారు!

స్కాలర్ పెన్ను—
ప్రపంచ ప్రఖ్యాత బ్లాక్ బర్డ్
పరివారం నుంచి మరొక
నాణ్యమైన పెన్ను

heros' SI-132 C TEL

ప్రతి పక్షమూ దాదాపు రెండు లక్షలమంది చదువు
తున్నారు. ప్రతి కుటుంబం లోనూ వనితలున్నట్టే-'వనిత'
కూడా ప్రతి కుటుంబంతోనూ కలిసి మెలిసి, తానూ ఒక
'సభ్యురాలు'గా మారు తున్నది! ప్రతి కుటుంబానికి
'అవసరం' అనిపించు కుంటున్నది!




మీ మంచి అలవాట్లలో మరొక మంచి అలవాటు 'వనిత' ప్రతి సంచికా చదవడం!

వనిత

చందమామ బిల్డింగ్స్ : మద్రాసు 600 026




# కావాలి అనుకుంటే
# కావలసినంత వినోదం!
## రేడియో సిలోన్

రేడియో కార్యక్రమాల్లో ఇంటిల్లిపాదికీ ఆనందం కలిగించాలంటే-'రేడియో సిలోన్' కు మించినది లేదు! ఇంగ్లీషు, హిందీ, తెలుగు, తమిళం, కన్నడ, మలయాళ భాషల కార్యక్రమాల్లో స్పష్టత, స్వచ్ఛత కావాలంటే 'రేడియో సిలోన్' వినవలసిందే! రేడియోలో అన్ని స్టేషన్లూ త్రిప్పి చూడండి - ఏ స్టేషన్ విస్పష్టంగా విన వస్తుందో అది, కచ్చితంగా 'రేడియో సిలోన్'.

ఇంగ్లీషు–ప్రతిదినం

| | |
|---|---|
| 0600 to 1000 hrs | 15525 KHZ (19 మీ) |
| | 9720 KHZ (31 మీ) |
| | 6075 KHZ (49 మీ) |
| 1800 to 2300 hrs | 15425 KHZ (19 మీ) |
| | 9720 KHZ (31 మీ) |
| | 7190 KHZ (41 మీ) |

హిందీ–సోమవారం నుండి శనివారం వరకు

| | |
|---|---|
| 0600 to 1000 hrs | 11800 KHZ (25 మీ) |
| 1200 to 1400 hrs | 7190 KHZ (41 మీ) |
| 1900 to 2300 hrs | 11800 KHZ (25 మీ) |
| | 6075 KHZ (49 మీ) |

హిందీ–ఆదివారాలు మాత్రం

| | |
|---|---|
| 0600 to 1400 hrs | 11800 KHZ (25 మీ) |
| | 7190 KHZ (41 మీ) |
| 1900 to 2300 hrs | 11800 KHZ (25 మీ) |
| | 6075 KHZ (49 మీ) |

తమిళం–ప్రతిదినం

| | |
|---|---|
| 1630 to 1900 hrs | 11800 KHZ (25 మీ) |
| | 6075 KHZ (49 మీ) |

మలయాళం–ప్రతిదినం

| | |
|---|---|
| 1530 to 1630 hrs | 11800 KHZ (25 మీ) |
| | 7190 KHZ (41 మీ) |
| | 6075 KHZ (49 మీ) |

తెలుగు–ప్రతిదినం

| | |
|---|---|
| 1430 to 1530 hrs | 11800 KHZ (25 మీ) |
| | 7190 KHZ (41 మీ) |

కన్నడం–ప్రతిదినం

| | |
|---|---|
| 1400 to 1430 hrs | 11800 KHZ (25 మీ) |
| | 7190 KHZ (41 మీ) |

విదేశాలలో వ్యాపారాభివృద్ధి కోరుకునే ప్రకటన దారులు ఈ విలాసాన్ని సంప్రదించండి.

రేడియో అడ్వర్టైజింగ్ సర్వీసెస్
సిసిల్ కోర్ట్
లాండ్స్ డౌన్ రోడ్
బొంబాయి 400039
టెలిఫోన్ : 213046/7
గ్రామ్స్ : RADONDA

30. ఫిఫ్త్ ట్రస్ట్ క్రాస్ స్ట్రీట్
మందవల్లిపాక్కం
మదరాసు 600028
టెలిఫోన్ : 73738
గ్రామ్స్ : RADONDA























నోరూరించే
మనసుదోచే
మైమరపించే




**పార్లే**

**పాపిన్స్**



పండ్లరుచిగల పిప్పరమెంట్లు